# సమాలోచన

జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక

సంపాదకుడు: విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి.

సంపుటము 4 సెప్టెంబరు 1-9 1981 సంచిక 21


ఈ సంచికలో



16—9—81 సంచికలో ధూర్జటి రచనా శిల్పము, జాషువా గద్య ప్రబంధము, ఆధునిక యుగమందలి వివిధ సాహిత్య ప్రక్రియలు, సోమసుందర్ ఫ్యాక్టరీ మొదలగునవి ఉంటాయి.

* 1, 16 తేదీలలో ప్రచురింపబడును *


చందా :
సంవత్సరమునకు రు. 12—00.
అర్ధసంవత్సరమునకు రు. 6—50.

విడిప్రతి 60 పై.

★ సమాలోచన ★

* జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక *

సంపాదకుడు : విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి

Retired Telugu Lecturer, V. T. J. College, Rajahmundry.

# ముక్తలక్షణకౌముదీ నామసార్థక్యము

- శ్రీ వి. చిరంజీవి, ఎం. ఏ.

బాలవ్యాకరణమునకు వెలసిన పూరణ గ్రంథములలోఁ త్రిలింగలక్షణ శేషము మొదటిది. ముక్తలక్షణ కౌముది రెండవది. త్రిలింగలక్షణ శేషకర్త వాడిన ముక్తలక్షణ వివేచన శబ్దమునుండి ముక్తలక్షణ శబ్దమును గ్రహించి, 'ముక్తలక్షణ కౌముది' యని యీ గ్రంథమునకు నామకరణముచేసి నట్లు చెప్పవచ్చును. శ్రీ యమ్. రామచంద్రుఁడుగారు, తమ ముక్తలక్షణకౌముదీ సమాలోచన వ్యాసమున [1-8-1981. సమాలోచనసంచిక] ముక్తలక్షణకౌముదీ శబ్దమున కిట్లర్థము చెప్పినారు. 'ముక్త = విడువఁబడిన, లక్షణ = శబ్దశాస్త్రమునకు, కౌముది = వెన్నెల' పూర్వ వ్యాకర్తలు చెప్పని శాస్త్రమును చెప్పునట్టి గ్రంథమే ముక్తలక్షణకౌముది' ఇటఁ బూర్వ వ్యాకర్తలను నెవరో తెలుపఁబడలేదు. 'బాలప్రౌఢ వ్యాకరణములకు పూరణగ్రంథముగా-అను వ్యాస ప్రారంభవాక్యమును బట్టి పూర్వవ్యాకర్తలనఁగా- బాలప్రౌఢ వ్యాకర్తలని గ్రహింపవచ్చును. కాని, ముక్తలక్షణ కౌముదిలోని పదాదియకార ప్రసంగము ముక్తలక్షణము కాదని వ్యాసకర్తలు పేర్కొనుట దీనికి బాధకముగా నున్నది. గ్రంథప్రణాళికను బట్టి సమాలోచించినచో, ముక్తలక్షణ కౌముది యందలి లక్షణములు చింతామణ్యాదులనుండి గ్రహించినవి కావచ్చును. ఆంధ్రభాషా భూషణాదుల నుండి గ్రహించినవి కావచ్చును. ప్రయోగాను సారముగాఁ బూరించిన నూతన లక్షణములుగావచ్చును. కాన, ముక్తలక్షణ కౌముదీ శబ్దమునకు. ముక్త = విడువఁబడిన - బాలప్రౌఢ వ్యాకర్తలచే విడువఁబడిన, లక్షణ=శబ్దశాస్త్రమునకు, కౌముది = వెన్నెల అని యర్థనిర్ణయము చేయఁదగును. సూక్ష్మముగాఁ జెప్పినచోఁ బ్రౌఢవ్యాకర్త పూరింపక వదలిన శబ్దశాస్త్రమునకుఁ గౌముది యని తాత్పర్యము

ముక్త లక్షణకౌముదిలోఁ బునరుక్తములు, కేవలార్థ ప్రతిపాదకములు, ముక్తలక్షణములు, సవరణ ప్రాయములు నగు లక్షణము లుండుటచే దీనిని, కేవల 'ముక్తలక్షణ కౌముది' యనఁజాల మని వ్యాసకర్తలు సోదాహరణముగా వ్రాసినారు. ఇది, కొంత పునస్సమాలోచన నపేక్షించుచున్నది. మొదటఁ బునరుక్తములయిన వ్యర్థసూత్రములు కలవనుటలోని సామంజస్యమును బరికింతము.

(1). 'దంత్యతాలవ్యచజలు మైత్రింబోరయు' అను సూత్రము, ముక్తలక్షణ కౌముది ప్రథమముద్రణమునఁ గలదు.' తీయఁగఁబంచదార వెనుదీయఁగఁజేసిన నున్ ద్వితీయగన్-' అను విజయవిలాస ప్రయోగము దీనికి లక్ష్యముగాఁ జూపఁబడినది. ఈ సూత్రము దంత్యతాల వ్యచజలుసవర్ణంబులు - అనుబాల వ్యాకరణ సూత్రము చేతనే గతార్థమగునని వ్యాసకర్తలు వ్రాసినారు. కాని, పయి విజయవిలాస ప్రయోగము బాలవ్యాకరణ సాధ్యము కాదు. తాలవ్య చ-జ,లకు విధించు వ్యాకరణకార్యములు, దంత్య చ-జలకు గ్రాహకములని బాలవ్యాకరణ సూత్రమున కర్థము. తాలవ్యచ జలకు విధించిన పరుష సరళ సంజ్ఞలు, దంత్య చ-జలకు గ్రాహకము లగుటవంటివి దీని కుదాహరణములు. విజయవిలాస పద్యమున, దంత్య చకార మర్థాంతర ఘటనమునఁ దాలవ్యతా పరిణామ రూపమైతి నందుచున్నది. ఇది, బాల వ్యాకరణ సూత్రమునకు విషయము కాదు. వ్యాసకర్తలు సవర్ణ వ్యవహారమును సరిగా గ్రహించినట్లు కనఁబడదు. కావుననే, 'సంబుద్ధిడుజ్జున కుకారాదేశ బు విభాష నగు' [ము. కౌ. ప్రథమ ముద్రణము] అనుచో, ఉకారము సవర్ణములకు గ్రాహకమని గ్రహింపక యాక్షేపించినారు. ఉకార మనుచో, సవర్ణములు గ్రహింపఁబడును గావుననే హ్రస్వోకారమును, 'ఉత్తు'-అని నిర్దేశించుట ప్రసిద్ధము. ఇట్లే సంజ్ఞా పరిచ్ఛేద సూత్రములన్నియు సంజ్ఞలే కానక్కఱలేదని వ్యాసకర్తలు గుర్తింపలేదు.' 'బాలవ్యాకరణ సంజ్ఞాపరిచ్ఛేదములోని

యేవో యాలంతి సూత్రములు పేరులకు సంబంధించి యున్నను నా పరిచ్ఛేదములోని విషయము లనేకము లట్టివికావు-' అని శ్రీవజ్ఝలవారు వివరించియున్నారు. (వ్యాకరణ సంహితా సర్వస్వము 21 పుట.)

(II). జైనులారెన్నఁడు, పాతకులారని - అను ప్రయోగములను 'అత్తునకు సంధి బహుళముగా నగు' అను బాలవ్యాకరణ సూత్రము చేతనే సాధింప వచ్చునని వ్రాసినారు. కాని యట్లు సాధించుట సూరి హృదయము కాదు. కావుననే శ్రీ. వేదము వారు, పాతకులారని -అను నాముక్తమాల్యదా ప్రయోగమును 'పాపులారాయని' యను రీతిని సవరించినారు. సూరి యుద్దేశింపని రూపములను, సూరి సూత్రములచే సాధింపఁజూచుట యసంగతము గదా!

(III). 'కృతోత్కంబగు సంస్కృత నామంబు సంబుద్ధిడుజ్జునకు లోపంబు విభాష నగు' అను బాలవ్యాకరణ సూత్రమునకు, ముక్తలక్షణ కౌముదీ సూత్రమునకు, స్వరూపప్రయోజనములలో భేదము లేదని వ్రాసినారు. ముక్తలక్షణ కౌముదీ సూత్రమునకు సుధన్వ, మాల్యవంత వంటివి లక్ష్యములుగా నీయఁబడినవి ఇవి, బాల వ్యాకరణ సాధ్యములు కానేరవు. ఏలన నివి సంస్కృత సమప్రాతిపదికములు గాని, సంస్కృత ప్రాతి పదికములు కావు. [చూ. రమణీయము 257 పుట.] కావున, రెండిటి స్వరూప ప్రయోజనములు కేవలము భిన్నములు. ప్రథమ ముద్రణ ప్రతిలో-సంస్కృత సమశబ్దము, సంస్కృ సమత - అని వ్యత్యస్తముగా, ముద్రితమయినది. లక్ష్యములను బట్టి 'సంస్కృతసమ' యని గ్రహింపక పోవుటచే వ్యాసకర్త లిట్లు వ్రాసి యుందురు.

(IV). కిమ్ము, కించిత్తు - అనురూపములు బాల. తత్సతము. 67,68 సూత్రముల చేతనే సాధ్యము లను వ్యాసకర్తలయాశయము సరికాదు. 'సూరి క్వచిన్నాను గ్రహేణ వేత్యాద్యథర్వణ కారికార్థమును సంగ్రహింప మఱచెను. కాన - కిమ్ము - కించిత్తు - అప్పు-మున్నగు రూపములు బాలవ్యాకరణ సాధ్యములు కానేరవు. [వ్యాకరణ సంహితా సర్వస్వము. 626 పుట.] అని శ్రీ వజ్ఝలవారు స్పష్ట పఱచియున్నారు. కావుననే, ముక్త లక్షణకౌముది, యథర్వణ కారిక ననువదించి వీనిని సాధించినది.

(V.) భక్త కూటువులు - అను నుదాహరణమును ప్రౌఢ వ్యాకరణ సూత్రమునందలి యఝ్ఝాదులలోఁ జేర్చుకొనవచ్చునని వ్రాసినారు. ఇట్లే కొన్ని రూపములను బాలవ్యాకరణ గణపాఠములలోఁ జేర్పవచ్చును. కావుననే, యిట్టి వివరణప్రాయములగు సూత్రములు ద్వితీయ ముద్రణమునఁ బరిహరింపఁబడి యున్నవి. వ్యాసకర్తలు ద్వితీయముద్రణమును జూచినట్లు లేదు.

వాఁడు లోనగునవి పూజ్యార్థకము లను ముక్తలక్షణకౌముది సూత్రము ప్రక్రియకు సంబంధించినది కాదని వ్రాసినారు. బాలవ్యాకర్త పూజ వివక్షించుచో, 'అతఁడు' లోనగు రూపము లగు నని నిర్దేశించెను. (ఆచ్ఛిక. 24 వృత్తి) కాన, వాఁడు లోనగునవికూడఁ బూజ్యార్థకము లని ముక్తలక్షణకౌముది పూరింపవలసి వచ్చెను.

ముక్తలక్షణకౌముదిలోని 'ఉక్తలక్షణములు, సవరణప్రాయములు, పునరుక్తములు నగుటచే వ్యర్థములను వ్యాసకర్తల యభిప్రాయము యుక్తముకాదు. పూరణ గ్రంథములు వార్తికలక్షణలక్షితము లయి యుండును. 'ఉక్తానుక్త దురుక్తార్థచింతా కారితు వార్తికమ్' అని వార్తికలక్షణము. ఉక్తార్థచింతనములు, దురుక్తార్థచింతనములు వ్యర్థము లనిపించుకొనవు. అనుస్వార విసర్గముల విషయమున మతభేదములు గలవు. బాలవ్యాకర్త, వీని నచ్చులుగా నిర్దేశించెను. ఇవి బాలవ్యాకరణోద్ద్యోతములో నుభయములుగా నిర్దేశింపఁబడెనని వ్యాసకర్త వ్రాసినారు. అనుభయము లనరాదా? యన్న చర్చ రమణీయములోఁ గలదు. కావున ననుస్వార విసర్గముల నచ్చులు గానే వర్ణపరిగణనమున గణింపవలె నని, ముక్తలక్షణ కౌముది వివరించినది. బాలవ్యాకర్త, యహోబలపండితీయము నందలి చర్చను దృష్టిలో నిడుకొని వీని నచ్చులలోఁ జేర్చెను కావున నహోబలపండితుని చర్చను 'ముక్తలక్షణకౌముది' యనువదించి, బాలవ్యాకరణోక్తార్థ చింతనము గావించినది. హలంతప్రక్రియ శ్రీ వజ్ఝల వారి సిద్ధాంతములతో వివాదాస్పదమయినది. కావునఁ బ్రయోగదృష్టితో ముక్తలక్షణకౌముది యుచితరీతి నుక్తార్థచింతనము చేసినది. వికృతి వివేకమునందును, లింగలక్షణ శేషమునందు నుక్తార్థచింతన, దురుక్తార్థచింతనములు గలవు. అట్లే ముక్తలక్షణకౌముది యందును గలవు. అవి పూరణగ్రంథములోని యంశములే.

పూరణ గ్రంథముల ముఖ్యోద్దేశము ముక్తలక్షణపూరణముగానే యుండును. ప్రసంగవశమున నుక్తార్థచింతనములు, దురుక్తార్థచింతనములు చేయుట తటస్థించును. అవి గౌణములు. ముఖ్యోద్దేశమును బట్టి నామకరణములు చేయుట జరుగును. ఉదాహరణకు బాలవ్యాకరణ తత్సమ పరిచ్ఛేదమునఁ గొన్ని సంజ్ఞావిషయములున్నవి. (తత్సమ 17, 20, 21) కొన్ని యాచ్ఛికవిషయము లున్నవి. (తత్సమ 24. 27, 46, 47) అంతమాత్రమున దానిని గేవలఁ దత్సమ పరిచ్ఛేద మనఁజాల మనుట తగదు. తత్సమ రూపసాధనమే ముఖ్యోద్దేశమగుటచేఁ దత్సమ పరిచ్ఛేదనామము సార్థక మని గ్రహింపవలెను. అట్లే ఉక్తార్థచింతనములు (సవరణలు) కొన్నియున్నను బాలప్రౌఢ వ్యాకర్తలచే లేదా ప్రౌఢవ్యాకర్తచే

( తరువాయి 3 వ పేజీలో )

# దశావతారములు - పురాణములు

— కుమారి ఆర్. రమ, ఎం. ఏ.

విశ్వజన్మస్థితి విలయంబులకు మూల కారణము భగవత్సృష్టి. పరమేశ్వరుడు త్రిగుణోపేతుడై సకల భూతములను సృజియించి, వానియందంతర్యామి రూపమున వెలుగొందుచుండును. దుష్టశిక్షణమునకు, శిష్టరక్షణమునకునై వివిధరూపధారుడై భూలోకమున నవతరించుచుండును.

'పరిత్రాణాయ సాధూనాం
వినాశాయ చ దుష్కృతాం ।
ధర్మసంస్థాపనార్థాయ
సంభవామి యుగే యుగే '॥

సాధువులను రక్షించుటకు, దుష్టులనుశిక్షించుటకు, ధర్మసంస్థాపనమునకునై ప్రతి యుగమునందును సంభవించుచు దును. అని స్వయముగ శ్రీకృష్ణుడు అర్జుననితో గీతోపదేశ సందర్భమున నుడివినాడు. ఆయా యుగములందు జగద్రక్షణార్థము ఆయారూపధారియగు భగవంతుని యొక్క విశేష కృత్యముల వలన ఆయా పేర్లేర్పడుచున్నవి. జగదధినాథుడైన శ్రీహరి జగముల కేవేళ గానీ సవ్యథ కలుగునో ఆ యా వేళల సతత లీలల యుగయుగమునం బుట్టి జగద్రక్ష గావించెను. శ్రీహరి యొక్క యవతారములు స్వల్పాస్వల్ప కాలమున నుండినవి మొత్తము ఇరువది యొకటి యని తెలియుచున్నది.

1. రమావల్లభుడు బ్రాహ్మణ్యుండై దుశ్చరంబైన బ్రహ్మచర్య వ్రతమున చరించుట.

2. విశ్వసృష్టి కొఱకై వరాహరూపమున రసాతల గత భూభారమును వహించెను.

3. మూడవమారు నారదరూపుండై విష్ణుభక్తి ప్రబోధముం జేసెను.

4. నరనారాయణాభిధానుండై దుశ్చర తపం బాచరించెను.

5. ఆసురి యను బ్రాహ్మణునకు సాంఖ్యయోగమును కపిలుండను నవతారమున నుపదేశించెను.

6. ఆరవ తనువున అనసూయాత్రిమహామునుల కుమారుడై యలర్కునికి, బ్రహ్లాదునకు ఆత్మవిద్య నెఱిగించెను.

7. ఏడవసారి రుచ్యాకూతులందు యజ్ఞుండను పేర నుద్భవించి స్వాయంభువ మన్వంతరమును రక్షించెను.

8 ఎనిమిదవ యవతారమున ఉరుక్రముండను పేర మేరుదేవియందు నాభికి జన్మించి విద్వజ్జనులకు పరమహంస మార్గోపదేశము గావించెను.

9. తొమ్మిదవ జన్మంబున ఋషుల కోరిక మేరకు పృథు చక్రవర్తియై భూమిని ధేనువుగా, జేసి సర్వవస్తు సృష్టి గావించెను.

10. దశావతారమున మీన శరీర ధారియై చాక్షుష మన్వంతరమున వైవస్వత మనువు నుద్ధరించెను.

11 పదునొకండవసారి కూర్మావతారమున మంథరాచలమును తనమూపున నిలిపెను.

12. పండ్రెండవపర్యాయము అమృతకలశహస్తుడై ధన్వంతరియను పేర క్షీరసాగరోద్భవుం డయ్యెను.

13. మోహినీ రూపమున దేవదానవులను మోహితులంజేసి సురల కమృతమిడెను.

14. నారసింహరూప ధారుడై కనకకశిపుని సంహరించెను.

15. కపట వామన రూపమున బలి చక్రవర్తిని పదత్రయము యాచించి త్రిలోకముల నాక్రమించెను.

16. పరశురామావతారమున నిరువది యొక్క మారులు బ్రాహ్మణద్రోహులైన క్షత్రియులను వధియించి, భూమి యందు క్షత్రియులు లేకుండం జేసెను.

17. వ్యాసావతారమున వేదశాఖలైన పురాణములను అల్పమతులకొఱకు లిఖించెను.

18. రామావతారమున దేవ కార్యార్థము క్షత్రియుండై రావణాది రాక్షసులను సంహరించెను.

19, 20. యదు వంశమున బలరామకృష్ణులై జన్మించి విశ్వంభరా భారమును నివారించెను.

21. కలియుగారంభమున బుద్ధావతారమున రాక్షస సమ్మోహనముకొఱకు నుద్భవించెను.

యుగ సంధి యందు ధరాధీశులు చోరప్రాయులై సంచరించుచుండ కల్కి యను పేర నుద్భవించెను.

పైని పేర్కొనిన యిరువది యొక్క యవతారములలో పది మాత్రము దశావతారములుగ ప్రసిద్ధి నొందినవి.

'మత్స్యః కూర్మో వరాహశ్చ
నారసింహశ్చ వామనః
రామో రామశ్చ కృష్ణశ్చ
బుద్ధః కల్కి తథైవ చ॥

(౬వ పేజీ తరువాయి)

ముక్తమయిన లక్షణమును బూరించుట ముఖ్యోద్దేశమగుటచే ముక్తలక్షణకౌముదీ నామము సార్థకమని గ్రహింపవలెను.

నేటి పరీక్షాపత్రములలో గ్రంథ నామసామర్థ్య సమర్థనకు సంబంధించిన ప్రశ్నల నడుగుట పరిపాటి. కాన, నీ వ్యాసము విద్యార్థి జనోపయుక్తమని భావించుచున్నాను. ఈ వ్యాసరచనకు దోహదముచేసిన సహృదయ సమాలోచకులు శ్రీ ఎం. రామచంద్రుడుగారి కభినందనలు తెలుపుచున్నాను.

—...—

ఏతాని దశ నామాని
స్మర్తవ్యాని సదా బుధైః
సమీపే యోగిణో బ్రూయు
ర్బాంధవా స్తే ప్రకీర్తితాః'॥ 1
'మత్స్యః కూర్మో వరాహశ్చ
నారసింహశ్చ వామనః
రామో రామశ్చ రామశ్చ
సబుద్ధః కల్కి రేవచ ॥ '2

గరుడ పురాణము మత్స్య, కూర్మ, వరహ, నారసింహ, వామన, పరశురామ, రామ, కృష్ణ, బుద్ధ, కల్క్యవతారములను దశావతారములుగ చేర్కొనినది. మహాబలిపురశాసనమున బుద్ధావతారము కూడ పేర్కొనబడినది. కాని కొన్ని యెడల బుద్ధావతారము స్తుతింపబడ లేదు కొన్ని యెడల బలరామ కృష్ణావతారములు రెండును ఒకటిగనే పరిగణింపబడినవి.

తిక్కన దశావతార స్తుతియందు మత్స్య, కూర్మ, వరాహ, నరసింహ, వామన, పరశురామ, రామ, బలరామ, కృష్ణ, కల్క్యవతారములు గలవు. ఈతఁడు బుద్ధావతారమును వర్ణింప లేదు. కొన్నింటియందు బలరామ కృష్ణబుద్ధావతారస్తుతు లున్నను దశావతారములుగనే చేర్కొనిరి.

ఇఁక దశావతారక్రమమున మత్స్య కూర్మ వరాహములను క్రమ మధికముగా కానవచ్చుచుండగా, భాగవతమున మత్స్యావతారము కంటె వరహావతారము మొదటిదిగా వర్ణింపఁబడినది.

దశావతారములందలి విషయము —

మత్స్యావతారము :

సోమకాసురుఁ డను రాక్షసుఁడు వేదములను దొంగిలించి సముద్రమున దాగియుండ సృష్టికార్యము నిలిచిపోగా తద్వేదపరిరక్షణార్థము మత్స్యావతారధారియై శ్రీహరి యవతరించి ఆదనుజుని అంత మొందించి వేదముల నుద్ధరించి బ్రహ్మకొసఁగినాఁడు.

కూర్మావతారము :

వృత్రాసురుఁ డను నిశాచర నాయకుఁడు ఆ ఖండలుని సింహాసనము నాక్రమించి అనేక విధముల దేవతలను, మానవులను బాధించుచుండెను. తత్సందర్భమున దేవతల ప్రార్థన నాలించి విష్ణువు, సయుక్తిని దైత్యులతో సఖ్యము నెఱపి, వారి సాహాయ్యమున క్షీర సముద్రోద్భవమగు నమృతమును ద్రావినచో దైత్యులను వినాశము చేయఁగలరను నుపాయమును జెప్పెను. దేవ దానవులు సముద్రమును మథించు సదర్భమున గవ్వముగాఁ జేసికొనిన మంథరపర్వతము సముద్రమున గూలగా విష్ణువుకూర్మావతారమున దానిని తన వీపున మోసి నిలబెట్టెను. అనంతరము సముద్రోద్భవమగు నమృతమును సేవించిన దేవతలు ఆరక్కసుల యుక్కడఁగించి స్వర్గమును మరల పొందిరి.

వరాహావతారము :

విష్ణుమందిర ద్వారపాలకు లగు జయ విజయులు మునులశాప వశమున హిరణ్య కశిపుఁడు, హిరణ్యాక్షుఁడు నను రాక్షసులుగా నుద్భవించిరి. హిరణ్యాక్షుఁడు భూమిని చుట్టచుట్టి పాతాళమున దాగికొని లోకోపద్రవమును బుట్టింపగా విష్ణువు వరాహావతారమున ఆదనుజుని దునుమాడి భూమిని తన దంష్ట్రపై నిలిపి దానిని ఎప్పటియట్లుండునట్లు చేసెను.

నారసింహావతారము :

హిరణ్యాక్షుని సోదరుఁడైన హిరణ్యకశిపుఁడు బ్రహ్మవలన పొందిన వరగర్వమున దేవతలను హింసించుచుండగా రమావల్లభుఁడు నరమృగ రూపధారియై యాతనిని సహరించి దేవతలకుఁ గల్గిన యుపద్రవమును తొలగించెను.

వామనావతారము :

బలియను రాత్రించరుఁడు త్రిలోకాధిపతి కాగా, దేవతల ప్రభావము తగ్గిపోయెను. దేవతల మొఱవిని వాని వంచుటకు కంసారి కురుచరూపమున వామనుఁడుగా నవతరించి ఉపనయనానంతరము భిక్షాటన చేయుచు, త్రిలోకముల నేలుచున్న బలిచక్రవర్తికడకు వచ్చెను. దాన శీలియైన బలి చక్రవర్తి కోరిక మేరకు మూఁడడుగులను దానముగా కోరి భూమ్యాకాశములను రెండడుగులతో నాక్రమించి, మూఁడవయడుగుగా బలిచక్రవర్తి శిరోభాగము నాక్రమించి యాతనిని పాతాళమున కణగద్రొక్కి, ఇంద్రునకు తిరిగి వాని యొక్క స్వర్గము నప్పగించెను.

పరశురామావతారము :

పూర్వము దత్తాత్రేయుని శిష్యుడైన కార్తవీర్యుఁడు వర మహిమచే సకల భువనములను తన యేలుబడిలోనికిఁ దెచ్చికొని దేవతలను, మానవులను బాధించుచుండగా దేవతల ప్రార్థనపై విష్ణువు జమదగ్ని కుమారుఁడుగ పరశురామావతారమెత్తెను. ఒకనాఁడు జమదగ్నియు, పుత్రులును ఆశ్రమమున లేనిసమయమున సహస్రబాహుఁడగు కార్తవీర్యుఁడు జమదగ్ని యొక్క హోమ ధేనువగు సురభిని లేగతోసహ తోలుకొని పోయెను. అనతరమావిషయ మెఱిగిన పరశురాముఁడు గండ్రగొడ్డలి చేత బూని కార్తవీర్యునితో పోరి, ఆతని సహస్రబాహువులను ఖండించి అంత మొందించెను. అంతట కార్తవీర్యుని పుత్రులు జమదగ్నిని వధింపగా, పరశురాముడు మిక్కిలి పరితపించినవాఁడై భూలోకమును క్షత్రియులు లేని దానినిగా జేసెద నని శపథము పూని ఇరువది యొక్క మాఱులు క్షత్రియ వీరులను జంపి వసుంధరయందు క్షత్రియుఁడన్న పేరు లేకుండఁ జేసెను.

రామావతారము :

విష్ణుమూర్తియొక్క ద్వార పాలకులుగానున్న జయవిజయులు శాపవశమున హిరణ్యాక్ష హిరణ్య కశిపులై జన్మించిన యనంతర జన్మమున రావణ కుంభ కర్ణులుగా నుద్భవించిరి. రావణుఁడు తపమా

చరించి, బ్రహ్మవలన ననేక వరములు పొంది దేవతల నందరను సేవకులను జేసి కొనినాఁడు. అందువలన వారు నారాయణుని శరణు కోరగా దశరథుని పుత్రుడుగా నవతరించి, రాముఁడను పేర పెక్కండ్రు రాక్షసుల నంత మొందించినాఁడు. స్త్రీలను బాధించు రావణుఁడు రాముని భార్యయగు సీతను చెరపట్టగా ఆమెను విడిపించు నెపమున రావణుని వధించి దేవతల బాధను దీర్చెను.

బలరామావతారము :

విష్ణువు కృష్ణావతార మెత్తినపుడు ఆదిశేషువు విష్ణ్వాదేశాను సారియై బలరామావతారము నెత్తి, కృష్ణుఁడు భూమిపై నవతరించిన యుద్దేశమును నెరవేర్చుటకు తఱచుగ తోడ్పడి, రాక్షసులను వధించి భూభారమును తగ్గించుటకు అనేక పర్యాయములు పరాక్రమ కార్యముల నొనరించినాఁడు.

శ్రీకృష్ణావతారము :

పరాక్రమవంతులైన దానవులు భూమిమీద జన్మించిజనులనుహింసించుచుండగా భూదేవి ఆదిగాగల దేవతల ప్రార్థన నంగీకరించి దేవకీ వసుదేవుల అష్టమ కుమారుఁడుగ జన్మించి, యశోదానందుల వద్ద పెరిగిన శ్రీకృష్ణుఁడు బాల్యమునుండియే రాక్షసులను దునుమాడుచు, కంసనరకాసురాదులైన రాక్షసులను పెక్కండ్రను వధించి, కురుపాండవ యుద్ధమున పాండవుల పక్షము వహించి దుష్టశిక్షణము, శిష్టరక్షణము గావించినాఁడు.

బుద్ధావతారము :

భూలోకమున వేదోక్తములైన కర్మములు సక్రమముగ నాచరింపఁబడుచు ప్రజలు స్వర్గస్థులగుచు, దేవ మానవుల కభేదము కలుగుచుండగా, యముఁడు, ఇతరదేవతలును విష్ణుమూర్తితో మొఱ పెట్టుకొనఁగా ప్రజలకు వేదములందలి గౌరవమును పోగొట్టి, కర్మభ్రష్టులను గావించుటకు బుద్ధావతారము నొంది బౌద్ధమతమును వ్యాప్తిగావించెను.

కల్క్యవతారము :

కృగుని కుమారుఁడైన కలిలోకము లందంతట కలుషమును వ్యాప్తిజేయుచుండగా భూదేవి విష్ణుమూర్తిని కలివలన గలుగు బాధను బాపు మని ప్రార్థింపగా, శ్రీహరి సుమతీయశుల కుమారుఁడుగా నుద్భవించి, శివుని నుండి కరవాలము, గుఱ్ఱము, చిలుకను పొంది, వానిసాహాయ్యమున కలినంత మొందించి అధర్మమును, మ్లేచ్ఛులను పరిహరించి ధర్మ సంస్థాపన గావించెను.

ఈ దశావతారములలో కొన్ని పురాణ రూపమును దాల్చినవి. 'పురాఽపి నవమ్ పురాణమ్' అనగా ప్రాచీనమైనదయ్యు నూతనత్వము కలిగినదని భావము. దీనిని బట్టి పురాణములలోని విషయము ప్రాచీనమైన దని తెలియుచున్నది. పంచలక్షణ యుక్తమైనది పురాణము.

'పురాణం పంచలక్షణమ్' అను నిర్వచనము ప్రకారము

'సర్గశ్చ ప్రతిసర్గశ్చ
వంశో మన్వన్తరాణి చ
వంశానుచరితం చేతి
లక్షణానాం తు పఞ్చకమ్'

అమరకోశము.

సర్గము, ప్రతిసర్గము, వంశము, మన్వంతరములు, వంశాను చరితము నను పంచ లక్షణములు గలిగినది పురాణము.

ఇఁక పురాణములు మహాపురాణములు ఉపపురాణములు నని ద్వివిధములు. అష్టాదశమహాపురాణములు, అష్టాదశోపపురాణములుగలవు. వస్తువైవిధ్యమును బట్టి మరల నివి సాత్త్వికములు, రాజసములు, తామసములు అని త్రివిధములు.

మహాపురాణములైన పదునెనిమిదింటిలో భాగవతము, భవిష్యము, వరాహము, వామన, కూర్మ, మత్స్య పురాణములు చేర్పఁబడినవి. ఉపపురాణములలో నారసింహము, వామనము, కల్కి, భార్గవములు చేరును.

ఇందు కొన్ని యవతారముల నామములు యథాతథముగ పురాణనామముగ పరిగణింపఁ బడినవి. పురాణరూపము నందిన మఱికొన్ని యవతారములు ఆయా యవతారము లందలి పేర్లతోగాక వేరొక నామముతో పురాణముగ వ్యవహరింపఁ బడినవి.

మత్స్యావతారము - మత్స్యపురాణము
కూర్మావతారము - కూర్మపురాణము
వరాహావతారము - వరాహపురాణము
నారసింహావతారము - నారసింహ పురాణము
వామనావతారము - వామనపురాణము
పరశురామావతారము-భార్గవపురాణము
రామావతారము - రామాయణము
శ్రీకృష్ణావతారము - భాగవతము
కల్క్యవతారము - కలికిపురాణము (భవిష్యత్పురాణము)

పైని పేర్కొనిన పురాణరూపము నందిన యవతారముల నామములలో మత్స్య, కూర్మ, వరహ, నారసింహ, వామనావతార నామములు పురాణ రూపమునగూడ ఆయా పేర్లతోనే కానవగును.

పరశురామావతారము పురాణ రూపమున భార్గవపురాణమను నామము నొందినది. రామాయణమను పేర రామావతారము నందలి విశేషములు పురాణరూపమున వెలసినవి. భాగవతమను పేర కృష్ణలీలలన్నియు పురాణత్వము నందెను. ఇఁక కల్క్యవతారము కలికి పురాణమనియు, భవిష్యత్పురాణ మనియు ద్విధా వ్యవహరింపఁబడుచున్నది

ఈవిధముగ దశావతారము లందలి ఆయాయవతారములు పురాణరూపము నొంది ప్రసిద్ధిగాంచినవి.

1. భాగవతము.

1. గరుడ పురాణము. అష్ట. అధ్యా ౧౦-౧౧.

2. క్రీ. శ. 7 వశ. నాటి మహాబలి పురశాసనము.

———...———

# హాస్యరస నాటకం - కన్యాశుల్కం

- శ్రీ మామిడేల హరినారాయణశర్మ, ఎం. ఏ.

తెలుగు సాహిత్యంలో శృంగార రసానంద ప్రధానమే ప్రధానలక్ష్యంగా కొనసాగుతూ హాస్యానికి ఏరకమైన అగ్రగామిత్వం లేకుండా పోయిందనే విషయాన్ని గుర్తించి, జీవితానుభవంలో హాస్యం యొక్క స్థానాన్ని గుర్తుచేయాలనుకొన్నాడు మహాకవి గురజాడ. అంతే కాదు. నాడు సంఘాన్ని పట్టి పీడిస్తున్న అనేక దురాచారాలను కన్నులకు కట్టినట్లైత్తి చూపించి నీతి ప్రచారం చేయాలని నిశ్చయించారు. అందుకు రంగస్థలమే తగినచోటని భావించి చిత్రించిన హాస్యభరితమైన సాంఘిక నాటకం – కన్యాశుల్కం.

హాస్యమంటే విదూషకుని వెకిలి హాస్యం కాదు. జీవితం 'లోతు' తెలుసుకోవాలంటే వస్తువుతో తాదాత్మ్యం పొందాలి. అదే రసానుభవం. హాస్యానికి, జీవితం పట్ల సాత్విక దృష్టికి, ఎంతసంబంధముందో సాహిత్యంలో మనం గుర్తించలేకపోయామనే అభిప్రాయాన్ని గురజాడ వారు ముని సుబ్రహ్మణ్యం గారికి వ్రాసిన లేఖలో వేదంవారి 'ఉషా' నాటకాన్ని గురించి ప్రస్తావిస్తూ వ్రాశారు. 'ఇంకను మానవ జీవితాన్ని గంభీరమైన దానినిగా భావించి నాటకంలో ఇతివృత్తంగా స్వీకరించాను. ఆద్యంతం నవ్వు తొణికిస లాడేటట్లు ఇంతగంభీర ఇతివృత్తాన్ని నిర్వహించడం అంత తేలికైన పని కాదు ... అన్నాడు. అంత కష్టమైంది ఆరసనిర్వహణ.

ఆంగ్లంలో Humour, Joke, Wit, Comic మొదలగు పదాలు దాదాపు హాస్యమనే అర్థంలోనే వాడబడుతున్నాయి. దశరూపకకర్త ఈ హాసితాన్ని స్మితం, హసితం, విహసితం, ఉపహసితం, అపహసితం, అతిహసితం అని ఆరువిధాలుగా చెప్పాడు. విశ్వనాథకవిరాజు దృష్టిలో హాస్య మనగా 'వికృతాకార వాగ్వేష చేష్టాదేః కుహకాద్భవేత్ హాస్యోహాసస్థాయిభావః' వికృతములైన ఆకారము, వాక్కు, వేషములను చూచుటచే జనించిన చిత్తవికాస రూపమగు వృత్తివిశేషమే హాస్యం. వికృతమంటేనే అనౌచిత్యం. ఆ అనౌచిత్యమే హాస్యకారణ మని క్షేమేంద్రుని వాణి. 'వాగంగాది వికార దర్శన జన్యవికాసో హాసః' అను పండితరాయల నిర్వచనం గూడ పై విషయాన్నే తెలుపుతుంది. హాస్యరసం స్థాయిని అందుకోవడం చాల సులభం. అంటే రసానుభూతి పొందడం. అదే ఆనందం. ఆ హాస్యం హద్దుదాటితే జుగుప్స. ఈ హాస్యరసం కన్యాశుల్క నాటకంలో ఏవిధంగా నిర్వహింపబడిందనే విషయాన్ని వివరించడమే ప్రస్తుత వ్యాసోద్దేశం.

'కన్యాశుల్కం' అను నాటక నామంలో హాస్యంలేదు. కాని వస్తువులో ఉంది. పన్నెండేండ్ల కన్నె పిల్లను కాటికి కాళ్ళుచాచిన ముసలిలుబ్ధావధాని కీయ సంకల్పించడం ఈ నాటకంలోని విషయం. ఈ ఈడు జోడుచూస్తే మనకు నవ్వు రాకతప్పదు. సంఘం దృష్టిలో అన్యాయం. బాధాకర విషయం. అందుచేత బాధ మీదనవ్వు.

నాటకంలో పాత్రల సంభాషణ వైఖరిని పరిశీలించిన హాస్యధోరణులు కన్పట్టును. ఇందు మధురవాణి వేశ్య. పేరుకు తగ్గట్టు ఆ సాని వాణి మధురమే. సంఘంలో సంస్కర్తపేరుతో చెలామణి అయ్యే పహనా సంస్కర్త గిరీశం. వీరి సంభాషణలో హాస్యం గమనించవచ్చు.

గిరీ – నాతో హైద్రాబాద్ వస్తావా? దానికి మధురవాణి చమత్కారంగా మధు– (తలతిప్పుతూ) నే ఎందుకు? పూటకూళ్ళమ్మని తీసికెళ్ళండి – అంటుంది. గిరీ – (నిర్ఘాంతపోయి) పూటకూళ్ళమ్మ యేమైనా వెంట వెడుతూందా యేవిఁటి? మధు – మీకే తెలియాలి. ఇది మధురవాణి వాక్చమత్కృతి.

గిరీశం వ్రాసిన ఉత్తరాన్ని రామప్పంతులుచదివి లుబ్ధుడికి వినిపిస్తాడు. 'ఈ నాటి వృద్ధాప్యంలో నయినా మీరు తిరిగి వివాహం చేసుకుని ఒక యింటివారు కావడమునకు నిశ్చయించితి రన్నమాట విని యమందానంద కందళిత హృదయారవిందుడ నైతిని' అని గిరీశం వ్రాసిన లేఖలోనివి హాస్యపు మాటలు.

లుబ్ధా :– వెధవ, వృద్ధాప్యమంటాడూ నిన్న గాక మొన్న నేగదా యాభై దాటాయి యాభై దాటాయంటే వృద్ధాప్యం వచ్చిందనే చెప్పాలి. కాని లుబ్ధుని దృష్టిలో తను వృద్ధుడు కాడు. దానికి తగినట్లు మధురవాణి దువ్వెన మొలను బట్టి, యౌవనుడుగా భావించుకొంటున్న లుబ్ధుడికి జుత్తుముడివేసి సంరక్షణ లేక యిలా వున్నారు. గాని, యెవరు మిమ్మల్ని ముసలివాళ్ళనేవారు? అని నవ్వువచ్చే మాట లంటుంది. ఏభైయేండ్లు దాటినముసలి లుబ్ధావధాన్లకు వేశ్యయైన మధురవాణి జుత్తు ముడివేసిందట తల్లి తన ముద్దులకొడుక్కు దువ్వి జడవేయడం సహజం._ఒక ముసలి అవధాన్లకు ఒక పడుచు వేశ్య జడ వేయడం హాస్యం Schopenhauev చెప్పిన నిర్వచనం సరిపోయింది. Humour consisted in sudden preception of a discort between reality and our idea

**or representation of reality** (ఉన్నదానికి ఉండవలసిన దానికి ఉన్న తేడా హాస్య మూలకం).

లుబ్ధావధానులు చతుర్థాంకంలో ఇంకా కొంత నవ్వు తెప్పించాడు. లుబ్ధుడు మధురవాణితో 'యేం?' ముసలి వాణ్ణని నీకూ తోచిందా యేవిఁటి? అంటాడు. సమాధానంగా మధు-మీరా ముసలివాళ్ళు? యవరా అన్నవారు' లుబ్ధా - నీకున్న బుద్ధి అగ్నిహోత్రావు ధాన్లకి వుంటే బాగుండును.

మధు - ఓ పన్నుకదిలిందా? కన్నుకు దృష్టి తగ్గిందా? చూడండి. మీకండలు కమ్మెచ్చులు తీసినట్లు యలా ఉన్నాయో? నేను మాత్రం తక్కువైవ వాణ్ణా అని రామప్పంతులు తన దండలు చూసుకొని 'మావఁ పెరట్లో గొప్పుతవ్వడం నుంచి దండలు మోటుగా వున్నాయి, గాని నా దండలు సన్నవైఁనా ఉక్కు ఖడ్డీలు.' అని అటాడు. ఈ సంభాషణలో హాస్యం కంఠదఘ్నంగా నిలిచింది 'తన అహంను లేవనెత్తునట్టియు, ఎదుటి వారి అహం దిగ దీయునట్టియు మాట లేక చేష్ట హాస్యమూలకం' అని ఫ్రాయిడ్ చెప్పిన అహముద్ధరణ పై సంభాషణలో ఉంది.

గిరీశం ఒక స్వేచ్ఛాజీవి. జీవితంలో తన స్వేచ్ఛాప్రవృత్తిని నిలబెట్టుకోవాలంటే హాస్యం అవసరం. ఈనాటకంలో గిరీశం వల్లనే ఎక్కువ హాస్యం పోషించబడింద నడంలో సందేహం లేదు. కేవలం హాస్యమేనా గిరీశం పాత్రలో మిగిలింది? అంటే కాదు. గిరీశం పాత్రలో హాస్య రసానుభూతి పొందాలంటే పాఠకుడు 'నీతి' అనే కొలబద్దను తాత్కాలికంగా నైనా, అవతల పెట్టాలి' అన్న ఆర్. ఎస్. సుదర్శనం గారి మాటల్ని బట్టి ఆపాత్రలో 'నీతి' అనేది కొంతైనా ఉంటుం దని అర్థంగదా' నీతిని ప్రక్కను బెడితే అతని మాటలు, చేష్టలు, మనకు ఆనందాన్నిస్తాయి. **The bliss of freedom gained in humour is the essence of Falstaff'** అని షేక్సియర్ సృష్టి అయిన ఫాల్ స్టాఫ్ ను గురించి ప్రొ. బ్రాడ్లే చెప్పిన సూత్రమే మన గిరీశానికి గూడ వర్తిస్తుంది. 'వెంకమ్మ మొగుడితో దెబ్బలాడి నూతులో పడ్డప్పుడు నేను సాహసించి నూతికి పైకి తీసిన దగ్గర్నుంచీ వూరంతా నన్ను సాక్షాత్తూ సత్యహరిశ్చంద్రుణ్ణిగా భావిస్తున్నారు. అడుగడుక్కీ బుద్ధి దాట్లే స్తూంటూందిగాని, నేనంతవాణ్ణి కానా యేవిఁటి? స్నేహంపట్ల పీకిచ్చేస్తారే గిరీశంగారు, సాధారణులా? ... అని గిరీశం తనను తనే హాస్యాస్పదం చేసికొన్నాడు. ఇట్లాచేయడం బుచ్చమ్మను వలలో వేసుకొనుటకు మాత్రమే. పాచిక పారినట్లయినా రామవరం చలో. విడో మారియేజ్ కరో. లెట్ మి బిగిన్ ది కాంపైన్ ఎట్ వన్స్' అని అంటూ తలుపు కన్నంలోనుంచి తొంగిచూచి 'ఎటులో ర్తునే చెలియా' అని కూనిరాగాలు తీస్తూ బుచ్చమ్మకు తమ్ముడు, తనకు శిష్యుడూ అయిన వెంకటేశాన్ని 'మై డియర్ బ్రదర్లా' అని వరస కలుపు కొంటాడు. ఇక్కడ గిరీశం ద్వంద్వ ప్రవృత్తి పాఠకులకు నవ్వు తెప్పిస్తుంది.

గిరీశం వ్యక్తిత్వంలో హాస్యం ప్రధానంగా చోటు చేసుకొంది. అతనిఊహల్లో తియ్యని కల్పనలు తొంగి చూస్తాయి. ఆ తీయని కల్పనలకు హాస్యంతోడైతే ఇక చెప్పాలేనా? యేడుస్తున్న బుచ్చమ్మ మీద విరహంతో ఆత్మహత్య చేసుకొని స్వర్గానికి చేరు కొంటూ డట గిరీశం. అక్కడ నవాభరణ భూషితురాలయి రంభ తక్కుతూ, తారుతూ వొచ్చి 'హా! ప్రియాగిరీశ, నీలాటిసుందరుణ్ణి యెన్నడూ నేను చూడలేదు, రమ్ము, నన్ను చేకొమ్ము' అని రెక్కపట్టుకు లాగుతుందట. అప్పుడు ఛీ! అవతలికిపో, నేను యాంటినాచ్చి. సానిది తాకితే పరమ అపవిత్రంగా తలుస్తాను. పియర్సు సబ్బు రాసి కడిగితే కాని యీ చేతికి కశ్మలం పోదు. నువ్వా రంభవి? మా బుచ్చమ్మ సొగసుకి నువ్వు వొడ్డీకి పనికి రావు. గో యెవే, డామ్ డర్టీ గూస్' అనేసి బుచ్చమ్మకోసం జపం చేస్తూ వుండిపోతా డట. జపం ఫలంగా 'నందనవనంలోకి చంద్రోదయం' లా బుచ్చమ్మ రాగానే కౌగిలించుకొ బోతా డట. ముసలి వెధవ, పొడుం ముక్కుతో ఆమె మొదటి మొగుడు అడ్డు రాగా వాడిచ్చిన కన్యాశుల్కం వాడి మొహాన పారవేసి స్వర్గలో సుఖంగా ఉండి పోతారట. అది గిరీశం ఊహాజగత్తులో కల్పన. ఈకల్పనలేవీ బుచ్చమ్మ మనస్సును మరలించలేవు. కేవలంగిరీశంలో ఉన్న మానవత్వ దృష్టి మాత్రమే బుచ్చమ్మని ఆకర్షించడానికి కొంత వరకు కారణ మయింది. పై కల్పన పగటి కల మాత్రమే. అందుచేత చివరికి 'నా బ్రతుకు హాస్యాల క్రింద ఐపోయిం' దని అంటాడు గిరీశం. నిజంగా పై కల్పనవల్ల మనకు మిగిలేది హాస్యమే.

మధుర వాణి యొక్క కంటెను అరువు యివ్వడానికి ఒప్పుకుంటే ఆంజనేయ స్వామికి వదిశేర్లు నెయ్యి దీపారాధన చేస్తానంటాడు శిష్యునితో కరటక శాస్త్రి. భోజన ప్రియుడు కాబట్టిశిష్యుడు 'కడుపులోకి వెళ్ళవలసిన నెయ్యి కాల్చెయ్యడం నాకేఁవీ యిష్టంలేదు' అమృత గుండీ మొక్కు కోండి' అని నవ్వు వచ్చే మాట పల్కుతాడు. హాస్యం చాలించు, బెడిసి కొడుతుం దని శాస్త్రి అనడంతో నిష్క్రమిస్తారు. ఆ శిష్యుడు మధుర వాణిదగ్గర శిష్యరికం చేస్తానని ఒప్పు కొని నీళ్ళు తోడుతాను, వంట చేస్తాను, బట్టలు వుతుకుతాను అని చెప్పు బ్రాహ్మణ్ణిగదా, కాళ్ళు పట్టమనవుకదా! అని హాస్యంగా అంటే మధురవాణి విరగ బడినవ్వి 'యిదా నీ గురువుదగ్గర చేసే శిష్యరికం' అని ప్రశ్న వేస్తుంది.

శిష్యు - మరచి పోయినాను. చిడప్పొక్కలు కూడా గోకుతాను. మధు - (నవ్వి) పెంకా? అంటూ ముద్దు పెట్టుకోవాలంటే శాస్త్రి అందుకొని కుఱ్ఱవాణ్ణి ఎందుకు చెఱుస్తావు. శిష్యరికం వాడి తరుఫునా, నా తరుఫునా నేనే చేస్తానంటూ 'పిల్లికి చెలగాటం, యలక్కి ప్రాణపోకటా!' అని సామెత విసరుతాడు. మీరు యలక కాదు. పంది కొక్కులు - మీ శిష్యుడూ యలక - అని మధురవాణి హాస్య సంభాషణ.

నాటకంలో కొన్ని సన్నివేశాలను హాస్యరసంలో రంగరించాడు గురజాడ. పాఠకులకు కడుపుబ్బ నవ్వు పుట్టించే ఘట్టాలవి. ప్రథమాంకంలో పాత్రలు మంచం క్రింద దూరతారు. ఉదాత్తదశ నుండి అల్పపరిస్థితికి పాత్రలు దిగజారడం హాస్యకారణమే కాదా మరి. కోర్టుల చుట్టూ తిరుగుతూ సంఘంలో పెద్దమనిషనబడుతున్న రామప్పంతులు వేశ్యతో సరససల్లాపాలాడుతూ గిరీశాన్ని చూడగనే భయపడి ఏమీ చేయలేక మంచం క్రిందదూరతాను వస్తువులు కొనిపెడతానని మోసం చేసిన గిరీశాన్ని పూటకూళ్ళమ్మనే వేశ్య తరుముకొస్తూంటే ఆ సంఘంలో సంస్కర్త అను పేరుతో చెలామణియయ్యే ఆ పెద్దమనిషి చేయునది లేక ఆ మంచం క్రిందనే దాగుతాడు. ఇట్లిరువురు అట్టి అల్పస్థితికి దిగజారడం Hobbes చెప్పిన హాస్యనిర్వచనానికి సరిపోయింది. Hobbes Described humour as a degradation of some person or interest possessing a certain dignity - (From the sublime to the Rediculous) అంతే గాక గిరీశం ఆమంచం క్రింద ఉన్న పెద్దమనిషిని చూచి 'ఎవరన్నా మీరు మహారుభావులు' అని మెల్లగా అనడం హాస్యరస స్ఫోరకమే. అది ఒకరి నొకరు తక్కువచేసికొనుచు పరస్పర విజిగీషతో ఆడు ఖేల. గ్రూస్ చెప్పిన విషయ మదే. మంచం క్రిందగుసగుసలు చూచి పూటకూళ్ళమ్మ చీపురుకట్ట తిరగేస్తుంది. ఆ దెబ్బ రామప్పంతులుకు తగిలేట్లు, ప్రక్కకు తప్పుకున్నాడు గిరీశం. అది చీపురుకట్ట సరసం.

ద్వితీయాంకంలో ప్రారంభంలో హాస్యసన్నివేశం ఎదురౌతుంది. వృత్తి కాబట్టి అగ్నిహోత్రావధాన్లుజంఝాలు వడకుతుంటే కరటకశాస్త్రి శిష్యుని చేత లేని పేలు నొక్కించుకొంటాడు. చివర అంకంలో సౌజన్యారావుతో సంభాషణ సాగిస్తుంటాడు గిరీశం. ఇంతలో మగవేషంతో వచ్చిన మధురవాణిని చూచి తన బ్రతుకును బజారుపాలు చేస్తుందని భయపడి గుట్టుగా కుర్చీక్రింద దూరి చమత్కారంగా తన్ను కాపాడమని బతిమాలుతాడు గిరీశం. మేడిపండు లాంటి గిరీశం కుర్చీక్రింద దూరడమనే అల్పస్థితికి దిగజారడంలో హాస్యముంది. చివరికి గుట్టు బట్టబయలౌతుంది. కథ అడ్డంగా తిరుగుతుంది.

గ్రాంథిక భాషను హాస్య సంభాషణకుపయోగించడం గురజాడవారి భాషాదృష్టి. వ్యావహారికాన్ని ఇతరపాత్రలకు వాడటంచేత గురజాడ నాటకోద్దేశం నెరవేరింది. తద్వ్యతిరేకదృష్టి వేదంవారిది. ముఖ్యంగా విజయనగర మాండలికాన్ని నాటకంలో ప్రయోగించుటచేత హాస్యానికి అవకాశం దొరికింది. అది ఆమాండలికంలోని యాస. ఉదా: నాయకుడు నిరాకరిస్తే నాయిక ఉద్యానాల్లో 'వుండుకున్నషు'వంటి లతలతో 'వురిపోసుకుంచుందండి.' మహాకవుల నాటకాల్లో 'అష్లాగే' జరిగినట్లు రాశారండి. గురువుగారైన గిరీశం శిష్యుడికి చేసే బోధనలో హాస్యం గమనించదగ్గది. చుట్ట కాల్చబట్టే దొర్లంత గొప్పవాళ్ళయినారని, చుట్ట పంపిణీమీదనే స్టీముయంత్రం వగయిరా తెల్లవాడు కనిపెట్టాడని కబుర్లు చెప్తాడు. అంతటితో ఆగక లేని శాస్త్రాన్ని చెప్పి నమ్మించి, మనల్ని నవ్విస్తాడు.

'ఖగపతి యమృతము తేగా
భుగభుగమని పొంగి చుక్క భూమిని ప్రాలెన్
పొగచెట్టై జన్మించెను;
పొగతాగనివాడు దున్నపోతై పుట్టున్.'

ఇది బృహన్నారదీయం నాల్గవ ఆశ్వాసంలో ఉందట. బృహన్నారదీయం లేదు. నాల్గవ ఆశ్వాసమూ లేదు. మరియేముంది? అంటే అబద్ధాలను నమ్మించడములో హాస్యముందని చెప్పొచ్చు. ఇంగ్లీషు తెలుగును కలగాపులగంచేసి అసందర్భంగా కవనాన్ని అల్లడంలో గిరీశం హాస్యధోరణి వ్యక్తమౌతుంది.

'నీ సైటు వాడి లైటు
నిన్ను మిన్న
కానున్న
క్వైటు రెచడ్ స్లైటు'

అని రాగవరసతో పాడుతాడు. అంతలో పొటిగరాప్పంతులు డబ్బడగటానికి వస్తే విననట్లు నటించడం, ఆ సందర్భంలో వారి సంభాషణా వైఖరిలో హాస్యం చోటుచేసుకొంది.

బంట్రో : 'యంతమందిని పంపినా యిచ్చారు కారటండి. నే వాళ్ళలా గూరుకుండేవాడ్ని కానండి.'

గిరీ: 'అయ్యా! కోనేటికి తోవ యిదే.'

బంట్రోతు:'యక్కడి శెవింటిమాలోకం వొచ్చిందయ్యా!'

గిరీ : 'కోవంటి దుకాణవాఁ ? కస్పా బజార్లోగాని యిటువేపు లేదు.'

బంట్రోతు : (గట్టిగా చెవిదగ్గర నోరు పెట్టి) పొటిగరాపుల కరీదిస్తారా ? యివ్వరా ?

గిరీ : 'బస, రాధారీ బంగాళాలో చెయ్యొచ్చును' ...ఇట్లా చెవుడని నటించడం, చివరకు గాయత్రిమీద ప్రమాణంగా కరీదు ఇస్తా ననడం – గిరీశంలోని చమత్కారం హాస్యం.

నాటకంలో అవసరానుసారంగా పాత్రలు ఒకరి కొకరు అడ్డుపేర్లతో పిల్చుకోవడం ఉంది. అసలు గురజాడ పాత్రలయొక్క స్వరూప స్వభావాదుల ననుసరించి ఆయాపాత్రలకు నామకరణం చేశాడు. అమాయికుడయ్యు సర్వకాలాలలో అగ్నిలాగా మండేతత్వం కలవాడు అగ్నిహోత్రావధాని. కాబట్టి గిరీశం దృష్టిలో అగ్గిరావుడు. నక్కజిత్తులమారి కరటకశాస్త్రికి రాస్కెల్, స్కౌండ్రల్ అని బిరుదాలు పెట్టాడు గిరీశం. పరమలోభి లుబ్ధావధానుల్ని 'త్వాష్ట్రం' అని; కోర్టుపక్షియైన రామప్పంతుల్ని 'ఎద్దుపుండు రుచిమరిగిన కాకి'గా పేర్కొన్నాడు. అందరికి పేర్లు తగిలించిన గిరీశానికి బహునామ బహూకరణచేసి బ్రతుకును బజారుపాలు చేశారు. బొల్లేరు ముక్కలతో బోల్తాకొట్టే గిరీశాన్ని 'బొల్లేరు', 'గిల్టుడు'గా కొట్టిపారేస్తాడు రామప్పంతులు. చేష్టలచేత 'హనుమాన్లు, తురక'గా పిలువబడతాడు. నెపోలియన్ ఆఫ్ ది ఆంటినాచ్ గా పేర్కొనబడ్డ గిరీశం చివరికి సౌజన్యస్వభావంగల సౌజన్యారావు నోటితో ఆషాఢభూతి, డెవిల్ గా చెప్పబడ్డాడు. సంఘాన్ని పీడించే సంఘవిద్రోహులను విమర్శించుటకొరకే గురజాడకు వైవిధ్యమైన హాస్య మవసరమయింది.

హాస్యరస ప్రధానమై కూడా ప్రహసనప్రాయమై పోకుండ ఈ నాటకాన్ని రక్షించిన సుగుణాలలో ప్రధానమైంది సాంఘిక వాస్తవికతా చిత్రణ. కన్యాశుల్కం కొరకు ఆశపడి, పడుచు కన్యలను ముసలివాండ్ర కిచ్చి వివాహంచేసి వారి జీవితాలను నాశనం చెయ్యడం ఆనాటి సంఘదుస్థితి. ఈ దుస్థితి నాటకంలోని సుబ్బి విషయం. నాటకకర్త చివరికి సుబ్బి పెండ్లి తప్పిస్తాడు. ఒక పరిస్థితిలో పెండ్లి నిశ్చయమై హఠాత్తుగా తెగిపోయింది. ఈ హఠాత్ఫలితం వల్ల పాఠకులకు ఆనందం కలగవచ్చు. అపై నవ్వు పుట్టవచ్చు. కాని అది సమాజానికి సందేశం. 'హాస్యనిర్భరమైన ఇతివృత్తం నుంచికూడా పరమ గంభీరమైన సందేశాన్ని వెలువరించడం గొప్ప సిద్ధి' అన్న విషయం ఈపట్టు సార్థకం.

వ్యావహారిక భాషోద్యమం జరుగుతున్న ఆరోజులలో వ్యావహారికాన్ని సాహిత్య స్థాయికి తెచ్చి సృష్టించిన నాటకం కన్యాశుల్కం. సమకాలీన సాంఘిక సమస్యల్ని సాహిత్యంలో ప్రతిఫలింప చెయ్యాలనేదే ఆయన ప్రధానదృష్టి. దానికి సజీవమైన వాడుకభాషలో, రసపుష్టితోసాగి తుష్టినిచ్చిన నాటకసృష్టి యిది. భాషావిషయకంగా వ్యావహారికం ప్రజా బాహుళ్యాన్ని పొందుతుందనేది యథార్థమే. గురజాడ 'నేను ఈప్రదర్శనాన్ని వాడుకభాషలో తొడిగాను. ఏమంటే ప్రజాబాహుళ్యానికి గ్రాంథిక భాష కంటె ఇదే సులభతర గ్రాహ్యం కనుకనున్నూ తెలుగులో హాస్యరచన కిటువంటి పదజాలం అనువైనదని నా నిశ్చితం గనుకనున్నూ' అని ఆంగ్లోపోద్ఘాతంలో చెప్పిన విషయాన్ని భమిడిపాటి తెలుగు చేశారు. గిరీశం యొక్క వాక్కు గూడ ఆంగ్లములోనే 'వేదం యనభై రెండుపన్నాలు ఒహ దమ్మిడీ పుస్తకాల ఖర్చులేకుండా చదువుకున్నాను. ఇదంతా టోప్పీ వ్యవహారంలా కనబడుతుంది' అని అగ్నిహోత్రావధాని బావమరది కరటకశాస్త్రితో అంటే, గిరీశం అందుకొని 'దిసీజ్ బార్బరస్' చూచారండీ జెంటిల్మన్, అనగా పెద్దమనిషిని యిలా అంటున్నాడో' అని ఆంగ్లంలో చెప్తూ, దానికి మరలా అర్థం కూడ పల్కుతూ నవ్వు తెప్పించాడు.

హాస్యం వైవిధ్యంగా సంభాషణాత్మకంగా, సన్నివేశ పరంగా, కథానిర్వహణ దృష్ట్యా, పాత్రలయొక్క వికారవాగంగాది దర్శనమూలమున నిర్వహించబడి హాస్యరసప్రధాననాటకంగా 'కన్యాశుల్కం' తీర్చిదిద్దబడింది. కె. వి. రమణారెడ్డిగారన్నట్లు ఆనాటకం వట్టినాటకం గాదు, జీవిత చికిత్స, హాస్యం వెకిలి హాస్యంకాదు, విజ్ఞాననిలయం.

ఆధార గ్రంథములు:-

1. కన్యాశుల్కం నాటకకళ – శ్రీ సర్దేశాయి తిరుమలరావు.
2. 'గురజాడ – షేక్స్పియర్'-(భారతిలో వ్యాసం) శ్రీ ఆర్. ఎస్. సుదర్శనం.
3. కన్యాశుల్కము (భారతి – జూన్ – 1955) – డా. కేతవరపు రామకోటి శాస్త్రి.
4. 'కన్యాశుల్కం' నాటక పీఠిక – శ్రీ కె. వి. రమణారెడ్డి.

—...—

# సాహిత్యంలో అహల్య

– శ్రీమతి పూసపాటి భాగ్యలక్ష్మి, ఎం.ఎ., పిహెచ్.డి.

గగనమండలము నలంకరించిన అసంఖ్యాకములగు తారలలో వెలుగుల మెఱుపులను గుమ్మరించి ఆహ్లాదమును కలిగించునవి కొన్ని మాత్రమే. అట్లే సారస్వత మండలమున వెలసిన అనేక ప్రముఖ పాత్రలలో ఒక ప్రత్యేకతకు ప్రతినిధిగ నిలచిన '**అహల్య**' పాత్రను అనుశీలనము చేయుట ప్రస్తుత వ్యాసోద్దేశము.

సకలచరాచర ప్రపంచమును సృజించు బ్రహ్మదేవుని మానసపుత్రిక అహల్య. అతడు మక్కువపడి తీర్చిదిద్దిన రత్నశలాక. సప్తమహర్షులలో బ్రహ్మచర్యమునకు, నియమనిష్ఠలకు ప్రసిద్ధి నందిన గౌతమమహర్షి ధర్మపత్ని. దేవేంద్రుని మోహమునకు గురియై, పతిశాపమునకు బలియై, మానవరూపమునకు వెలియై లోకమున శాశ్వత మగు కళంకమును పొందిన దీమె. పెక్కు వేల సంవత్సరములు తన దురదృష్టమునకు కలిగిన పశ్చాత్తాపముచే తపోవృత్తి యందు లీనయై, భగవంతుడగు శ్రీరాముని పదధూళిచే పవిత్రయై పునరుజ్జీవమును, అతిలోక సౌందర్యమును, పతి సాన్నిధ్యమును పొందినది. స్థూలముగ సాహిత్యములో ఆమె కథ ఇది.

ఈ కథనుబట్టి చూచిన లోకములో గల సతీమణుల కంటె ఈమె చరితము భిన్నమైనది. ఈమె వ్యక్తిత్వము నందు గల మిగిలిన విషయములన్నియు ఉపేక్షింపబడి, జీవితములో ఆమె పొందిన కళంకమునకు మాత్రమే సాహిత్యమున స్థానము లభించినది. కాని విచిత్రమేమనగా కవులు ఒకవంక ఈమె చరితము కళంకితమైన దని నిరూపించుచు మరియొక వంక పంచకన్యలలో, పతివ్రతలలో ప్రథమ తాంబూలము నీమెకే యొసంగినారు. సామాన్య ప్రజలు తలచుచున్నట్లుగ అహల్య కట్టి ప్రథ ఏర్పడుటకు కారణము ఈమె వ్యక్తిత్వమా? పరిస్థితుల ప్రాబల్యమా? అను విషయమును పరిశీలింపవలయును.

ఋషితుల్యుడగు కవి సామాన్యకథను తీసికొనుట, ఉబుసుబోక కల్పనలు చేయుట, జరగదు కదా! ప్రతి కథ వెనుక, పాత్రచిత్రణ వెనుక అనంతమైన అంతరార్థము గాని, ఆదర్శము గాని ఉద్దేశించును. ఆదృష్టితో పరికించిన అహల్యకథయందు ఒక మహాత్త్వము ఇమిడి యున్నది. ఆమహార్థము నవగాహన చేసికొనవలయునన్న అసలామె పుట్టుపూర్వోత్తరముల నుండియు పరిశీలింప వలయును.

సాహిత్యములో రామకథ విశ్వరూపముదాల్చినది. ఆ రామకథ వర్ణింపబడిన కావ్యము లన్నింటియందును, నించుమించుగ అహల్యకథయు వర్ణింపబడినది. ఆది కవి కావ్యముతో ప్రారంభమైన అహల్య కథ అధునిక కాలము నాటికి అనంతములయిన నూతన కల్పనలను పొందినది. ఆ మార్పులను వివరించుటయే ఏతత్ వ్యాసోద్దేశము.

అహల్య వృత్తాంతమునకు శ్రీకారము చుట్టిన కావ్యము వాల్మీకి రామాయణము. ఈకావ్యమున అహల్యకథ బాల-ఉత్తర కాండములందు కలదు. కాని ఆరెండింటి చిత్రణయందు వైవిధ్యము కలదు.

బాలకాండమునందు అహల్య వృత్తాంతము ఈ విధముగా గలదు. అహల్య గౌతమునితో గూడి పెక్కు సంవత్సరములు గార్హస్థ్య జీవితమును గడపినది. ఒకప్పుడు ఇంద్రుడు గౌతమ వేషధారియై ఆశ్రమమునకువచ్చి తన కోరిక తీర్పు మని అహల్యను ప్రార్థింపగా ఆమె అతనిని దేవేంద్రునిగా గుర్తించియు అతనియందుగల కోరికచే అంగీకరించినది.

'ముని వేషం సహస్రాక్షం
విజ్ఞాయ రఘునందన
మతిం చకార దుర్మేధా
దేవరాజ కుతూహలాత్.'

దీనిని బట్టి మునివేషధారియైన ఇంద్రుని ఆమెగుర్తించినట్లు, దేవరాజను కుతూహలమును పొందినట్లు స్పష్ట మగుచున్నది. అంతేకాదు 'కృతార్థాస్మి సురశ్రేష్ఠ' అని తదనంతరము పలుకుటలో ఆమె పొందిన సంతోషము వ్యక్తమగుచున్నది.

ఆమె సంతృప్తహృదయయై గౌతము డాశ్రమమునకు తిరిగి రాక పూర్వమే అతనిని వెడలిపొమ్మని ప్రార్థించినది. తీర్థస్నానమాచరించి తిరిగివచ్చిన గౌతముడు ఇంద్రుని గాంచి అతని దుర్వృత్తికి శపించుట జరిగినది. పిమ్మట అహల్య కూడ శపింపబడినది.

ఇహవర్ష సహస్రాణి
బహూని నివసిష్యసి
వాతభక్షా నిరాహారా
తప్యన్తీ భస్మశాయినీ
అదృశ్యా సర్వభూతానా
మాశ్రమేஉస్మిన్ నివత్స్యసి.
బాల 31 - 48

పెక్కువేల సంవత్సరములు నిరాహారయై కేవలము గాలిని పీల్చుచు భస్మశాయినియై, ఇతరుల కదృశ్యయై, ఆయాశ్రమముననే నివసించుట ఇందలి శాపము. ఆమె ప్రార్థింపక పూర్వమే శాపావసానము గూడ సూచింపబడినది.

యదా త్వేత ద్వనం ఘోరం
రామో దశరథాత్మజః
ఆగమిష్యతి దుర్ధర్ష
స్తదా పూతా భవిష్యసి.
తస్యాతిథ్యేన దుర్వృత్తే
లోభ మోహ వివర్జితా.
మత్సకాశే ముదా యుక్తా
స్వంవపు ర్ధారయిష్యసి.

ఇక ఉత్తర కాండయందలి కథ. బ్రహ్మదేవుడు సమానవర్ణము, సమాన భాష, సమానరూపము గల ప్రజలను సృజించెను. వారిలో ఎట్టి భేదము లేక పోవుటచే చాల ఆలోచించి ప్రజల యొక్క ప్రత్యంగసౌష్ఠవమును గ్రహించి ఒక విశిష్టసౌందర్యప్రతిమను సృజించెను. ఆమె పేరే అహల్య. హాల మనగా విరూపము, హల్య మనగా వైరూప్యము. హల్యము లేనిది కనుక ఆమె అహల్య. ఇట్టి అనింద్య సౌందర్యశాలిని యగు కన్యను నిర్మించి ఆమెకు తగిన వరునికై పితామహుడు అన్వేషింప సాగినాడు. దేవేంద్రుడు తాను త్రిలోకాధిపతియగుటచే తనకే బ్రహ్మదేవుడు అహల్యనిచ్చునని ఆలోచింపసాగినాడు. కాని విధాత ఆమెను యువకుడు, బ్రహ్మచర్య నిష్ఠుడు, పరమ తపస్వి అగు గౌతమునివద్ద న్యాసభూతముగా నుంచెను.

చాలకాలము గడచిన పిమ్మట అతడామెను బ్రహ్మకు తిరిగి సమర్పింపగ, బ్రహ్మ అతని మానసిక స్థైర్యమునకు, తపస్సిద్ధికి మెచ్చి, అతనికే ఆమె నిచ్చి వివాహము గావించినాడు. ఇంద్రుడిందులకు కోపించి గౌతముని ఆశ్రమమునకు వచ్చి దీపశిఖవలె, అనింద్యమును అసాధారణమునైన సౌందర్యముతో దీపించు అహల్యను చూచి కామార్తుడై, గౌతముడాశ్రమమున లేని సమయమున ఆమెను బలాత్కరించినాడు. ఆ విషయము తెలిసి గౌతముడు ఇంద్రుని, అహల్యను శపించినాడు. 'అసాధారణ రూపవతియగు నీవు మానసిక చాంచల్యము కలిగి యుంటివి కనుక నీ వంటి రూపవతులు లోకమున చాలమంది పుట్టగలరు. నీవు ఆశ్రమ సమీపముననే నశింపుమని శపించినాడు. ఆ శాపవాక్కులువినిన అహల్య దేవేంద్రుడు నీరూపమున వచ్చుటచే నీవని భ్రమించి లోబడితినే కాని, స్వేచ్ఛావృత్తిచే కాదు, కనుక నన్ననుగ్రహింపు' మని పలుకగా, అతడు దయార్ద్ర హృదయుడై రామ దర్శనమును శాపాంతముగ సూచించినాడు. నాటి నుండి తన పాప నివృత్తికై అహల్య కఠోర తపమాచరించుట ప్రారంభించినది. ఇది ఉత్తర కాండమందలి అహల్య వృత్తాంతము.

దీనినిబట్టి వాల్మీకి రామాయణమున అహల్య పాత్ర చిత్రణము నందు గల వైవిధ్యము గోచరించుచున్నది. బాల కాండము నందలి కథనము ప్రకారము అహల్య గౌతముని ధర్మపత్నియైనను పాతివ్రత్యమునకు విరుద్ధముగ ప్రవర్తించినది. వచ్చినవాడు దేవరాజని తెలిసియు అతని కోరికను అంగీకరించుటచే పరపురుష సంగమాభిలాషిణియైన అధర్మపరాయణ యైనది. ఆమె వ్యక్తిత్వమునకే తీరని మచ్చను తెచ్చుకొనినది. కాని ఈ లోపములు ఉత్తరకాండ యందు సవరింపబడినవి. ఇట అహల్య పరమ పావన, తన్ను కోరి వచ్చినవాడు పతి యని తలచుటచే ఆమె ప్రవర్తన ఉత్తమ సతీత్వమునకు నిదర్శనము. అంతేకాదు ఆమె నిర్దోషిత్వమునకు చిహ్నము. బాలకాండయందు వర్ణింపబడని పశ్చాత్తాపము, దుఃఖము, భయము ఈమెయందు గౌతముని శాపము వినుటచే కలిగినవి. అందువలన ఆమె శాపాంతమును వేడుచు తన నిర్దోషిత్వమును ఋజువుచేసికొన యత్నించినది. చివరకు పెక్కు సంవత్సరములు తపస్సమాధి నంది రామదర్శనముచే యథారూపము నందినది. పశ్చాత్తాపము, తపస్సు, నిరంతర భగవన్నామ స్మరణము ఆమెకు భగవత్సాక్షాత్కారము కలిగించినవి. అంతేకాదు. శారీరక మానసిక దోషములు నశించి పూతచరిత్రయై భర్తను చేరినది.

వాల్మీకి రామాయణము పిదప అనేక రామాయణములు వెలసినవి. ఇవిఅన్నియు అహల్యను చిత్రవిచిత్రరీతులలో వర్ణించినవి.

అధ్యాత్మరామాయణమున, గౌతముని బ్రహ్మచర్యమునకు మెచ్చి బ్రహ్మదేవుడు అతని శుశ్రూషకై నిర్మించి ఇచ్చిన అతిలోక సౌందర్యశాలిని అహల్య. ఈ రామాయణమునందు ఆమెకు ఇంద్రునిపై మక్కువ కలదో, లేదో తెలియుటలేదు. ఈ కావ్యమున గౌతముడు 'వణకుచు ఎంతపని చేతులు మొగిడ్చి, భీతియు, సిగ్గు దోప'నిలువబడిన అహల్యను చూచి -

'దుష్టే త్వం తిష్ఠ దుర్వృత్తే
శిలాయా మాశ్రమే మమ
నిరాహారా దివారాత్రం
తపః పరమ మాస్థితా
ఆతపానిల వర్షాది
సహిష్ణుః పరమేశ్వరం
ధ్యాయన్తీ రామ మేకాగ్ర
మనసా హృది సంస్థితమ్॥'

అని శపించినాడు. శిలారూపమున ఆశ్రమ ప్రాంతమున నుండుటయే ఇందలిశాపము. విశ్వామిత్రుడు రామలక్ష్మణులకహల్యను చూపుచు 'దర్శయామాస చాపల్యా ముగ్రేణ తపసా స్థితాం' అనుటచే శిలారూపమున నుండినను ఆమె చైతన్యము కలదియై యుండినట్లు తెలియుచున్నది. వాల్మీకమునందువలె రామచంద్రుని పాద రజస్స్పర్శచే యథారూపము నంది నమస్సహస్రములతో రాముని స్తుతించినది.

దేవ మే యత్ర కుత్రాపి
స్థితాయా అపి సర్వదా
త్వత్పాద కమలే సక్తా
భక్తి రేవ సదాఽస్తు మే.

అని తపఃపూతయగు అహల్య గావించిన శ్రీరామస్తుతి, ఇహలోక విషయపరాఙ్ముఖత నందిన ఆమె హృదయమునకు నిదర్శనము. భగవంతుని యందే లీనమగుటకు యత్నించిన ఆమె మానసిక పరివర్తనకు తార్కాణము. ఇది అధ్యాత్మరామాయణమున గల అహల్యా చిత్రణము.

ఆనందరామాయణమున అహల్యకథ మరియొక్కరీతిగా నున్నది. బ్రహ్మ అహల్యను సృష్టింపగా, ఆమెరూపలావణ్యములకు వాసవాది దేవతలందరూ మోహప

వశులైనారు. వాసవుడు ఆమెరూపమునకు పరవశుడై ఆమెను తనకు భార్యగా ఇమ్మని బ్రహ్మను కోరినాడు. కాని ఒక్క దినమున పాదచారుడై భూప్రదక్షిణము చేసిన వానికి ఆమె నొసగెద నని బ్రహ్మ పలికినాడు. వాసవాదులు ఈ కార్యక్రమమున కుద్యమింప, మేధావియగు, గౌతముడు గోప్రదక్షిణము చేసి ఆమెను పొందినాడు. ఇట్లు గౌతమునకు దేవతలందరిలో కలిగిన పోటీయందు గెలుచుకొనిన వ్యక్తియైనది అహల్య. ఇక మిగిలిన కథ పై కావ్యములకు అనుసరణయే. కుటిలరూపమున వచ్చినవాడు 'ఇంద్రుడని గ్రహించుట, ఆతనితో కలిసి ఆనందము అనుభవించుట, గౌతముచే శిలయైయుండునట్లు శపింపబడుట జరిగినది.

ఇంక పురాణములందు అహల్యపాత్ర చిత్రణము కొంత కలదు. ఆమెపై వివాహము నాటికే అనురాగము పొందియున్న దేవేంద్రుడు విద్యాభ్యాసమిషచే గౌతముని చేరి, సమయముచూచి పొంచి, గౌతముని రూపముతో ఆమెను రమించె నని పద్మపురాణము వర్ణించినది. 'అజ్ఞానాత్ యత్కృతం కర్మ క్షంతు మర్హసి వై ప్రభో' అని ప్రార్థింపగా, గౌతముడు 'అస్థిచర్మసమావిష్టా, నిర్మాంసా, నఖవర్జితా, చిరంస్థాస్యసి చైకాపి త్వాంపశ్యంతు జనాః'

అని శపించినాడు. అనగా ఎముకలతోడను, చర్మముతోడను మిగిలి, మాంసమును, గోళ్ళును లేనిదై నలుగురు చూచుచుండగ చిరకాలముండుట, అనునది ఇందలి శాపము. ఇది వాల్మీకముకంటె భిన్నమైనది. 'అస్యాదోషో నచైవాస్తి దోషోయం పాకశాసనే' అని చెప్పియుండుటచే ఇందు ఆమె పవిత్రమూర్తిగనే నిరూపింపబడినది.

——···——

# చిరస్మరణీయురాలు 'స్నేహలత'

— శ్రీ ఎన్. స్వామి, ఎం. ఏ.

ప్రకృతియే స్త్రీ యని, స్త్రీ లేనిది పురుషుడు జంతు ప్రాయుడని, సృష్టికి స్త్రీ వికాసహేతువు అయినందు వల్లనే దేవుడు స్త్రీని తనకు మారుగా సృష్టించాడు. అంతటి స్త్రీ భోగ్యవస్తువుగా కేవలం క్రయవస్తువుగా పరిగణించ బడుతూంది. సమాజంలో చెల్లిగా, తల్లిగా ఇల గృహసీమను కాపాడే దేవతగా అవతరించింది స్త్రీ. అంతటి గొప్పదైన స్త్రీ జాతినే చులకనగా చూస్తున్న అవివేక లోకానికి వికాసోదయమే రాయప్రోలు వారి రమ్యమైన కావ్యసృష్టి. అందులో అందాలణి బరి స్నేహలతామ తల్లి.

వంగ దేశస్థురాలు స్నేహలత. కన్నతండ్రి కుటుంబ పరిరక్షణార్థం, వరశుల్క నిరసనగా ఆత్మార్పణం చేసుకున్న అభాగ్యురాలు స్నేహలత. దురాచారాల దుష్టవ్యవస్థ కాహుతి అయిన వాస్తవకథే స్నేహలత కావ్యంగా రూపు దిద్దుకుంది. శుల్కదురాచారాల పిశాచాల విజృంభణం అలము కొన్న ఈ చీకటిలోకానికి ఒక చిరు దివ్వెగా ఈమె కథ వెలుగుతుందని, ఆ వెలుగే ప్రభాతమై చీకట్లను పారద్రోలు తుందనే ఆశయంతో రాయప్రోలు వారు తమ కవితా నైపుణ్యంతో కావ్యాన్ని రూపొందించి ఆంధ్రలోకానికి అందించినారు.

ఎదిగిన కూతురు పెళ్ళి కాలేదను పెద్ద సాంఘిక నింద మోయలేక కాళ్లువాయంగ కడప కడప తిరిగి తిరిగి విసిగి వేసారి దీనపు మొగంతో తిరిగొచ్చిన తండ్రి పరిస్థితి, కడుపున కన్నందుకు కష్టాలోర్చి చివరకు మంచికులం, గుణము ఉన్న వరుని చూసి తగిన శుల్కానికై ఇల్లును తాకట్టు పెట్టిన తండ్రి దుస్థితి, చూస్తూ, అంతయు ఆమె మూలంగా పోయిందను అపవాదు చెవుల్లో మారుమ్రోగి ఆమె మనస్సును కలచివేశాయి. కడుపున చెడబుట్టిన పాపానికి జ్ఞానవతిని చేసింది చాలక నాకోసం ఉన్నదంతా ఊడ్చి నాతోబుట్టిన వాళ్ళకు శాశ్వత దారిద్ర్యం మూటకడుతున్నారు మాతాపితలు. పావనమైన పితృగృహాన ఇటువంటి దుర్గతి ఎలా తెచ్చిపెట్టేది? అని దీర్ఘాలోచనతో సతమతమౌతూ హృదయ వేదన నొందుతుంది ఆమె.

అంతు తెలియని ఆలోచనల సుడిగుండాల్లో అల్లకల్లోలమౌతుంది ఆమె మనస్సు. ఏ ఆధారం కూడా ఆమెకు కన్పించలేదు. ఇట్లామె పరిస్థితి ఉండగా ప్రియంవద మాటల సందర్భంలో స్నేహలతతో మొన్న పెండ్లిచేసిన పుణ్యవల్లి తండ్రి వరశుల్కానికై చేసిన ఋణం తీర్చక సంఘంలో తల ఎత్తుకోలేక గంగలో తనువు చాలించా'డని మరియు, శ్యామల కూడ శుల్కమిచ్చుకోలేని స్థితిలో ఈ గంగలోనే తనువు చాలించిందని చెప్పెను. అప్పటికే స్నేహలతలో భావాలు సుళ్ళు తిరుగుచున్నాయి. పైగా చెలి చెప్పిన సంగతులు అగ్నికి ఆజ్యం తోడయినట్లు తోడైనాయి. ఇక సమస్యలకు తట్టుకోలేక ఆత్మత్యాగ నిర్ణయం చేసుకున్నది.

ఇల్లు చేరి రాత్రి పొద్దు పోయిం తరువాత ఆతలంపు మనస్సునకు రాగానే నిష్కళంకంగా తలుపు ఓరగాఁ దీసి తెల్లవారితే ఈయింటి లక్ష్మి శుల్కరూపంలో వెళ్ళిపోతుం దని, మామక పితామహులు నిర్మించిన ఈపవిత్ర కుటీరానికి పరపాద ధూళి మాలిన్యంచేత కీడుగలుగ నిత్తునా యని, నావలన కన్న తల్లిదండ్రులకు, తోబుట్టువులకు దారిద్ర్యంగలుగ నిత్తునా యని, వేదాలు వెలసిన ఈ పవిత్ర దేశం

లో కన్యల పుట్టుక శుల్కాల పాలయ్యే కర్మ ప్రాప్తించిం దని, ఇట్టి అవస్థపాలైన స్త్రీ జాతికి నా ప్రాణార్పణంతో మేలుచేయగల స్నేహమో యని తైలవస్త్రాన్ని కట్టి నారచీర దాల్చిన సీత వోలె.

'భగవతీ ధ్యానమున భగభగ వెలుంగు
వహ్నిలోన, బూర్ణాహుతి యయ్యె నయ్యొ
ధన్య గుణవల్లి స్నేహలతామ తల్లి'

త్యాగానికి పూనుకొని తనువును చాలిస్తుందిగాన కలుషితమైన లోకాన్ని వీడి స్వచ్ఛమైన లోకాన్ని చేరుకోబోతూంది కాబోలు. చింత యే మాత్రం లేక ...

'నవ్వు మోముల నిండు మనసులతోడ
నొండొరుల కౌగిలింతల నోలలాడు
తండ్రి బిడ్డల పగిదిని తనిసి రపుడు
ఒదిగి స్నేహలతాపితృ హోత్రు లవుర'.

శుల్కనిరసనకై సాగుతున్న ఆత్మత్యాగాలకు ఆదరణలభించే రోజులు చేరువైనాయని, శుల్కాచారాల దుష్ట వ్యవస్థ కూలిరాలి పోతుం దని, అమాయికలైన ఆడవాళ్లు శుల్కరాక్షసి దురంతాల కోరల్లో బలికాకుండ ఉండాలని ...

'అధమ శుల్కకలంకము నంటకుండ
నాపవిత్ర దీక్షా కన్యకా పథంబు
రక్షణము చేసినట్టి యీ దక్షిణాగ్ని
కలుషితాచారములఁ గాల్చి వెలుగుగాక'

అని ధర్మదేవతను నమ్మి అబలకు న్యాయం చేకూర్చుమని మనస్ఫూర్తిగా ప్రార్థించి ఆత్మత్యాగం చేసిం దామె.

దురాచారాల దుష్టవ్యవస్థలో ఆదరణ లేని ఆత్మత్యాగంగా మిగిలిం దిది. ఇల తండ్రి ఇక్కట్లు బాప అనలుఁ డనే తండ్రితో నైక్యమైన స్నేహలత చరిత్ర వల్ల సాంఘికాచారాలలో కొంచెమైనా మార్పు రాలేదు. కన్నకుటుంబ రక్షణ కోసం వరశుల్కనిరసనగా ఆత్మార్పణం చేసుకొన్న అబలగాథ కఠినహృదయాలని కదిలించలేకపోయింది. అగ్నిజ్వాలలు ఆమె దేహాన్ని అలముకొని మలమల మాడ్చి మసి చేసిన సంఘటన మలిన మనస్సులను మార్చలేక పోయింది. సంఘానిది కరడు కట్టినగుండె. ఇంకెన్ని ఆత్మాహుతులకు ప్రసన్నతనొందుతుందో యేమో ఈసంఘం.

రానురాను అబలల పరిస్థితి బాగా దిగజారిపోయింది. స్త్రీ పురుషుల మధ్య జన్మతఃయేమీ భేదం లేదే? సృష్టిలో లేనిది సంఘంలో ఈ భేదాలు ఎలా తలెత్తాయో ఆలోచనకే అందని సమస్యగా మిగిలింది. స్త్రీజన్మయింత దుర్భరంగా తయారయిం దనేందుకు యువకులు శుల్కాలకై ఉవిళ్ళూరుటే కారణం. ఆదరణయేలేక ఆడబ్రతుకుల నింతగా నీచభావంతో చూడడం ఎక్కువయిందనేందుకు స్త్రీకి పురుషునికున్న అధికారాలే కారణాలయినాయి. స్త్రీకి పురుషునితో సమాన ప్రతిపత్తి కల్పించి సమానావకాశాలిస్తే వారేమీ తీసిపోర నేది నిజం. అయితే స్త్రీపై పురుషునకు సర్వాధికారాలుండాలనేది నిర్వివాదాంశం. స్త్రీని సమానంగా గౌరవించిన్నాడు, స్త్రీని ఆరాధ్యదైవంగా ఎంచిన్నాడు, వరశుల్కాలపై ఆధారపడని నాడు, స్త్రీని బానిసగా చూడని నాడు పురుషుడు స్త్రీకి దైవమవుతాడు, స్త్రీకి భర్తయే దైవమను మనువు మాట సార్థకమౌతుంది. స్త్రీజన్మ ధన్యమౌతుంది.

—...—

# గణపతి స్తుతి

— శ్రీ వెలుదండ నిత్యానందరావు

'గరికయు, చిల్వ జన్నిదము,
కొంజరమా లపనంబుఁ జూచి శం
కరు, శర జన్ము, శైల సుత
కాండములున్ వెసమెక్కరాఁగ నే
నరయఁగఁ బాశహస్తుఁడ
వినాయకుడన్, శరభావతార సో
దరుఁడ నటంచు వారల
నదల్చిన దేవునిఁ బ్రస్తుతించెదన్.'

క్రమాలంకారంలో మనోజ్ఞంగా విరచింపబడిన ఈ పద్యకర్త ఎవరో తెలియదు. ఇది మొత్తం పైని పూర్వకవికృత అనేక అజ్ఞాత పద్యములలో చేరిన ఒక పద్యము. గణపతి ధరించిన గరికను గాంచి శంకరుని వాహనమైన నంది రాగా పాశహస్తుడ నని అదల్చినాడు. పాశ మనగా పలుపు, అంటే ఎద్దును బంధించ గల్గిన తాడు. ఆ తాడుతో బంధించ గలనని నందిని బెదిరించినాడు.

గణపతి జందెము కొండచిల్వ యట, తండ్రి మెడలోను, చేతులకు, తలకు పాములను ధరిస్తే, కొడుకు కేవలం యజ్ఞోపవీతంగానే తాల్చాడు. ఈ చిల్వ జన్నిదమును చూచి కుమారస్వామి గారి వాహనమైన నెమలి లొట్టలేసుకుంటూ తినుటకు వచ్చింది. మరి వెంకయ్య సామాన్యుడా? వినాయకు డను పదమునకు గరుత్మంతు డనికూడ నైఘంటుక లోక అర్థం చెప్పారు. ఆ అర్థం చటుక్కున జ్ఞప్తి కొచ్చి 'వినాయకుడ' నని అన్నాడు ఆ సిద్ధి బుద్ధీశ్వరుడు. ఇంకేం! ఆ నెమలి తమ పక్షి జాతికి రాజైన గరుత్మంతుడే యేమో అని పొరపాటుతో భయపడి పారిపోయింది. ఇది వినాయకునికి గల పాండిత్యానికి ఉదాహరణము.

కుంజర ముఖుని వాక్కులు చూచి కాదు, విని శైలసుత వాహనమైన సింహము వెసమెక్క రాగ శరభావతారుని సోదరుడ నని అదరగొట్టినాడు. సింహాన్ని చంపగల్గిన జంతువు శరభ మట. కుమారస్వామి శరభావతార మెత్తాడట. నేను శర భావతార మెత్తిన కుమార స్వామి సోదరుడ నని జెప్పి సింహాన్ని పారద్రోలిన ఆ విఘ్నేశ్వరుని స్తుతించాడు కవి.

ఇంతటి చక్కని పద్యము రచించిన కవి నామము తెలియక పోవుట దురదృష్టకరము. ఇది మా గ్రామ పురోహితులు బ్రహ్మశ్రీ కోదండరామశర్మగారి వలన విన్నది. వారికి కృతజ్ఞతలు.

—...—

# పుష్పవిలాప మొక అపూర్వ కళాఖండము

– శ్రీ డా. డి. ఎస్. వి. సుబ్రహ్మణ్యం, ఎం. ఏ. పిహెచ్.డి.

'కరుణశ్రీ' పుష్పవిలాపము ఒక సుకుమారసుందర భావనా స్వరూపము. మనోజ్ఞశిల్పము. అపూర్వ కళాఖండము. తెలుగునాట ఈ పద్యములు బహుళ ప్రచారము పొందినవి. ఈ కావ్య ఖండికపై ఖండనమండనములు బహుళముగ నావిర్భవించినవి. పూలపై కరుణశ్రీ భావములను కొందరుదూషింపగ ఎందరో భూషించిరి. పుష్ప విలాపముపై దుమారము చెలరేగినది. ఇదిపూల దుమారము గనుక ఆఘ్రాణ యోగ్యమే అయినది.

ఈఖండిక యందు పుష్పములు మానవుల వలె మాట్లాడుచున్నటులు చిత్రింపబడినది. కనుక ఇది మానవీ కరణ కవితకు చెందినదన వచ్చును. 'The endoment of abstract qualities general terms, inaminate objects or other living things, with human attributes,ers feelings' అను షిప్లే 'Personificate' కవితానిర్వచనము వలె' మానవేతరములందు మానవధర్మములు ఆరోపింపబడుట, 'మానవీకరణ కవిత అన వచ్చును. నీతి చంద్రికయందలి కథలు కూడ ఇందు చేరును.

కవి ఈఖండికద్వారా దీనహీనమ్లాన జీవితములతో చెరలాటము లాడవద్దని పుష్పవ్యపదేశంలో ఉపదేశించారు. మా యౌవనమెల్ల కొల్లగొని ఆపై చీపురు తోడ చిమ్మి మమ్ము అవల పారబోయవద్దని పూలకంఠాలలో మానవ కంఠములను మారు మ్రోగించినారు. ఆ వశ్యకమైనంత వఱకూ మాటెక్కుల కష్టము నందుకొని అనుభవించి, ఆనందించి వాడి వత్తలై రెక్కలు జారిపోవగనే పరిహరింతురు మమ్మువెంట డిబ్బులపై అని కష జీవుల కరుణస్వరమును విరులగొంతుకలో వినిపించినారు. పరమసుకుమారములగు విరులు మానవ హృదయములకు ప్రతీకలు. అవి భగవంతుని అస్తిత్వమునకు ప్రతిబింబములు, అవి కరుణామయుడగు భగవంతుని కరుణా మరంద బిందువులను చిందించు ప్రకృతి బాలలు. అటువంటి సుకుమార సుందరసురభిళ సుమ పుంజములను నిర్దాక్షిణ్యముగ త్రుంచుట, చీల్చుట, త్రొక్కుట, రెక్కలు విరుగునట్లు నలిపి వేయుట గుండెలలో సూదులు గ్రుచ్చి వేధించుట బాధించుట కోమల హృదయుడగు కవి గుండెను కదలించినవి. లతామ తల్లులనుండి పూలను గిల్లుట తల్లి బిడ్డలను వేరు చేయుటయే యని కవి భావన. ఇందు స్వార్థము కల దని కరుణశ్రీ భావము. కనుక నే అమ్మకొందువె మోతు వి త్తమ్ముకొఱకు? హృదయమే లేని నీ పూజలెందు కను పూల ఆక్రందనమును, హుంకారమును కరుణశ్రీ ఆలకించగలిగిరి.

ఇంతటి సున్నితములగు భావములను వ్యక్తముచేయ వలెనని కవి మానసిక సంఘర్షణకు గురి కావలయును. కవి హృదయమును కదలించెడి సంఘటనలచే గాని, సన్నివేశములచే గాని ఉత్తేజితుడై విపరీతమగు మానసిక సంక్షోభమునకు గురియై ప్రసవవేదనను అనుభవించి గుండెలలోని బాధను మాటల రూపమున బాహిరింప జేయును. అంత ర్మథనప్రళయ సముద్రోద్బుద్ధమైన కవితనిరుద్దష్టమై కడిగిన ముత్యమువలె ప్రకాశించి పదుగుర హృదయముల స్థానము నాక్రమించును. ఒకే విషయమునకు సంబద్ధములైన సంఘటన లనేకము ఆ దృష్టిగల వాని హృదయము నాకర్షించి మానసిక సంక్షోభమునకు కారకము లగును. 'కరుణశ్రీ' పుష్పవిలాపము ఇట్టి సున్నిత–సన్నివేశములకు రూపు దాల్చిన ఆకృతి. ఆసన్నివేశములు కొన్ని పరికించెదము. (21-11-79 వ తేదీని కవి ఈసన్నివేశములు ముఖాముఖి సంభాషణమున తెలియజేసిరి.)

ఒకమారు ఇంటికి వచ్చినమిత్రునికి ఆదరముతో అప్పుడే కోసిన గులాబీలను ఇచ్చి, కాఫీ తెచ్చుటకు 'కరుణశ్రీ' ఇంటిలోనికి వెళ్ళిరి. తిరిగి వచ్చునంతలో మిత్రుని చేతిలో రేకలులేనితొడిమ మిగిలినది. రేక లన్నియు ఆమిత్రుడు నములుచుండుట కవికంట బడినది. అపుడే కవి ఆర్ద్రహృదయము ద్రవించి కన్నీరు కార్చనది.

ఒక పరి 'కరుణశ్రీ' తల్లావఝ్ఝుల శివశంకరశాస్త్రిగారిని కలియుటకు వారి నివాసమునకు వెళ్ళిరి. అక్కడ పూలతో 'సత్యం, శివం, సుందరం,' అని అందముగ పేర్చిరట. శివశంకరుల మిత్రు డొకరెవరో వచ్చి ఆ పూలను దోసిటబట్టి గట్టిగా ఒత్తిపట్టుకొని పూల వాసనను ఆఘ్రాగిణించి క్రింద పోసి రట. ఆపూలు వాడి వత్తలైపోవుటచే కరుణకవి గుండెలు పిండియై పోయినవి. హృదయము కంపించినది. అల్లే పూలను మంగలములో మాడ్చి 'చాదు' తయారు చేసి ఆడవారు బొట్టుగ ఉపయోగింతు రని తెలిసి ఆందోళన చెంది రట. సన్మానములలో పూలరేకలుచల్లుట, పూలనుత్రొక్కుచు నడచుటవంటి సన్ని వేశములు కరుణశ్రీ గుండెలలో విపరీతమగు బాధనుకలిగింప జేసినవి. ఇకను ఇటువంటి సంఘటనలచే ప్రభావితులైన శాస్త్రి గారి మనసు తీవ్ర సంక్షోభమునకు గురియై పుష్పవిలాప రచనమునకు దారి తీసినది.

ఆదికవి వాల్మీకియు ఇటువంటి సన్నివేశముచే ప్రేరితుడై శోకోద్దీపిత మనస్కుడయి ప్రథమశ్లోకమును సృజించినాడు కదా! ఇటువంటి సన్నివేశములు వారి వారి చిత్తవృత్తికి అనుగుణముగ తమ ప్రభావమును చూపు చుండును. ఉదాహరణమునకు గాలిలో తేలియాడు మబ్బులను పదిమంది చూచినచో వారి వారి మానసిక స్థితిగతుల కనుగుణముగ ఆ మబ్బులలో ఆకృతులు చూడగలరు. పుష్పముల జీవితమును పరిశీలించిన కరుణశ్రీ మృదుహృదయమున కనుగుణముగ పుష్పవిలాప ముదయించ, మరొకరి మానసిక స్థితిగతుల కనుగుణముగ పుష్ప ప్రమోదము, వివేకము కలుగవచ్చును.

పుష్పవిలాప చ్ఛాయలతో ఇతః పూర్వము కవిత లున్నవా అని ఒకపరి పరికించిన, ప్రత్యేకముగ కావ్యములు లేకున్నను మహాకవులు ఆయాసందర్భముల ననుసరించి తమ భావములు వెల్లడించిరి.

'నఖలు నఖలు బాణః
సన్నిపాత్యోఽయస్మిన్
మృదుని మృగ శరీరే
పుష్ప రాశా వివాగ్నిః' 2

అనికవి కులగురువు 'పుష్పరాశియందు అగ్నివలె, మృదువైన ఈమృగము శరీరమున బాణము లేయవల' దని ఆశ్రమవాసులగు వైఖానసులు దుష్యంతుని నివారించి రని నుడివెను. '20 వ శతాబ్ద ప్రారంభములో పత్రికలలో కొన్ని ఖండ కావ్యములు ప్రచురింపబడుచుండెడివి. ఆ రోజుల్లో వేంకటపార్వతీశ్వర కవులు చాతకము, చంద్రకాంత పుష్పము సూర్యకాంత పుష్పము మొదలగు ఖండ కావ్యములు ప్రకటించిరి. సూర్యకాంత పుష్పము సూర్యోదయముతో వికసించి, తల యెత్తి, ప్రొద్దు గ్రుంకినంతనే ముకుళించుకొని పోవును. సూర్యాస్తమయమయినంతనే పూవు విలపించుచున్నది. దానికి దుఃఖము భరించు శక్తి లేక పోయిన దని భావించి ఓదార్చుట ఈ కావ్యమునందు కానవచ్చుచున్నది.3 అను (సారస్వత వ్యాస సంపుటిలోని) మీనాబాయి గారివచనములను బట్టి కరుణశ్రీ పుష్పవిలాపమునకు పూర్వము తెలుగులో పుష్ప విలాపమేగాక సాంత్వనము కూడ కల దని తెలియు చున్నది.

ఇటువంటి భావములనే పుష్పవిలాపము ద్వారా కరుణశ్రీ తెలియ జేసిరి. బహుళ ప్రచారముపొందిన ఈ కావ్య ఖండికలో చలువగల వెన్నెలకు సౌరభ మబ్బినట్లుగ కరుణశ్రీ కమనీయ శిల్పము ఘంటసాల గానమాధుర్యముతో విశేషముగ ప్రజాసన్నిహితమైనది.

ఈ ఖండకావ్యమునందు ప్రధానాంశము పుష్పములు కవితో తమ గుండెలోని బాధను మొరపెట్టుకొనుట. ఈ పుష్పములు లోకములోనిఅభాగ్య మానవకోటికి ప్రతీకలు. పూలుచిదుమువారలు ధనికవర్గపు బావుటాలు అని ధ్వనితము. పూల మొర నాలకించిన కవి పూలను చిదుమజాలక రిక్తహస్తములతో దేవర కెరుక చేయుటకు దేవళమున కరిగినాడు.

'నేనొక పూల మొక్క కడ
నిల్చి చివాలున కొమ్మవంచి గో
రానెడు నంతలోన విరు
లన్నియు జాలిగ నోళ్ళు విప్పి 'మా
ప్రాణము తీయుదే' యనుచు
బావురు మన్నవి క్రుంగిపోతి నా
మానసమం దెదో తళుకు
మన్నది పుష్పవిలాప కావ్యమై'

'ఇది కరుణశ్రీ హృదయోత్పలమునుండి వెల్లుబికి వెల్లువలై ప్రవహించిన తేనె వాక' 4 అంటారు సీరపాణి. పూవును చిదుముటకు గోరానునంతలోన విరులన్నియు జాలిగా నోళ్ళువిప్పి బావురు మన్నవి. నిశితముగ బరిశీలించిన ఆక్రందనములలో ఎందరో అభాగ్యపు అబలల విలాపము, కష్టజీవుల దుర్భరదీనాలాపము వినిపించును.

ఆ విరులు సున్నితముగ మందలించు చున్నవి. మమ్ములను మోక్ష విత్తమ్ము కొఱకు అమ్ముకొనుచుంటివి. హృదయము లేని నీ పూజ లెందుల కని ప్రశ్నించు చున్నవి. అంతియగాక నీమది బండ బారినదా? శివుని పూజకు చిన్ని పూలు పూయజాలదా? అని గద్దించు చున్నవి. 'మేము బ్రతికిన నాల్గుగడియలు స్వేచ్ఛగ బ్రతుకుచు.

'గాలిని గౌరవింతుము సు
గంధము పూసి, సమాశ్రయించుభృం
గాలకు విందు సేసెదము
కమ్మని తేనెలు, మిమ్ము బోంట్లనే
త్రాలకు హాయి గూర్తుము, స్వ
తంత్రుల మమ్ముల స్వార్థబుద్ధితో
తాళుము త్రుంచబోవకుము;
తల్లికి బిడ్డకు వేరుసేతువే! '

గాలిని గౌరవించి, భృంగాలకు విందులు చేసి మానవుల నేత్రాలకు హాయిగూర్చు పూబాలలను స్వార్థ బుద్ధితో త్రుంపకుము. తల్లిని బిడ్డను వేరుచేయ వద్దని మృదువుగ పలికినవి.

'ఊలు దారాలతో గొంతు నురిబిగించి
గుండెలో నుండి సూదులు గ్రుచ్చి కూర్చి
ముడుచుకొందురు ముచ్చటముడుల మమ్ము
అకట! దయలేనివారు మీ యాడువారు'

ఉరిబిగించుట గుండెలో సూదులు గ్రుచ్చుట నిర్దయకు చిహ్నములుగ కనిపించుచున్నవి. ఈ పద్యము సంఘమున విశేష ప్రచారముపొంది, ఎంతయో ప్రభావము చూపినది. ఎందరో మగువలు పూలను తలలో ముడుచుటమానుకొనిరి.

'అక్కట హాయి మేయు మహి
షాసురు లెందరో నాల్గు ప్రక్కలం
బ్రక్కల మీద చల్లుకొని
మాపసి మేనులు పాదుకాళ్ళతో
త్రొక్కుచు దొర్లి - దొర్లి - మరు
గోజుదయాన నె వాడివత్తలై
రెక్కలు జారిపోన్ పరిహ
రింతురు మమ్ముల పెంటదిబ్బపై'

మహిషాసురులతో పోల్చబడిన సుఖలాలసగలవారు 'హాయి మేయుట' సముచిత ప్రయోగము. వాడివత్తలై రెక్కలు జారిపోన్ పరిహరింతురు. అను పదముల లోని వాచ్యార్థముతోపాటుగ వ్యంగ్యార్థమును గ్రహింప వలెను. ఇచ్చట పుష్పములు రెక్కల కష్టము పైనే ఆధారపడిన కష్టజీవులకు ప్రతీకలు. మాయామర్మము లెరుగని ఆ కష్ట జీవులలోని మానవత్వమే ఇచట మృదువైన పుష్పము. శరీరములో శక్తి యున్నంతవఱకు పనులు చేయించుకొని, శక్తి సన్నగిల్లిన త్యజించుట ధనికవర్గపు స్వభావమును తెలియజేయుచున్నది.

'మా వెలలేని ముగ్ధ సుకు
మార సుగంధ మరంద మాధురీ
జీవిత మెల్ల మీకయి త్య
జించి, కృశించి, నశించి పోమె, మా
యౌవన మెల్ల కొల్లగొని,
ఆపయి చీపురుతోడ చిమ్మి మ
మ్మావల పారబోతురు గ
దా! నరజాతికి నీతి యున్నదా! '

స్త్రీలను పూలతో పోల్చి పూబోడి, ఇత్యాదిగ ప్రయోగించుట అనూచానముగ వచ్చుచున్న సంప్రదాయము. 'వెలలేని ముగ్ధ సుకుమార సుగంధ మరంద మాధురీ జీవిత మెల్ల మానవుల కొఱకు త్యజించి కృశించిన పూలలో అభాగినులైన పూబోడులు ప్రతిబింబించు చుండిరి. వాడిన చీపురుతో చిమ్మి ఆవల పారబోసినటుల స్త్రీ జాతిని అభాగినులుగ జేసిన నరజాతికి నీతియున్నదా! అని పూల గొంతులలో అబలల ఆక్రోశము ప్రతిధ్వనించు చున్నది. బుద్ధుడు జన్మించినంతటి గొప్ప భూమియందు పుట్టితివి. అయిననూ అచ్ఛస్వచ్ఛమయిన ప్రేమ చచ్చిపోయినది. పూజ లేకున్న చాలును మా కుత్తుకలను కోయకుము. మమ్ము హత్య చేసి నీవు బావుకొనున దేమి ? ఇట్లు పుష్పములు చీవాట్లు పెట్ట నీకు విన్నవించుకొనుటకు వచ్చితి నని ముగింపు.

పరమ సుకుమారమైన సుందర సన్నివేశమును ఇంతరమ్యముగ చిత్రించిన ఈ ఖండికను గూర్చి 'జీవత్వ ద్యోతనానికై ఆరోపించిన మనుజత్వం వల్ల ఎన్నో అనర్థోపదేశాలు తటస్థ పడుతున్నాయి' [5] అని శ్రీజమదగ్ని అభిప్రాయ పడినారు. వీరి అభిప్రాయమును ఖండించుచు' అత్యంత సుందరమైన శిల్పంతో జాతీయమూ, మకరంద సదృశమూనైన తేట తెలుగునుడికారంతో కరుణరసభరితమై మానవ సమాజాన్ని ఒక మెట్టు పైకి తీసుకొని పోగల్గిన ఆధునిక మహాకావ్యం' పుష్ప విలాపాన్ని శ్రీజమదగ్నిగారు అమంగళాపాది అనడం సమర్థనీయం కాదు' అని కె. వి. రామారావు గారి జవాబు. ఇత్యాదిగ పూల దుమారము నేటికిని రేగుచునే యున్నది.

పుష్పవిలాపమునకు అనుకరణకావ్యములు పుష్పప్రమోదము పుష్ప వివేకము, కుక్కుట విలాపము వంటి ఎన్నియో విలాపకావ్యములు వెలువడినవి. కరుణశ్రీ కావ్యములను విమర్శించువారిని గూర్చి చర్చించుచు 'పుష్పవిలాపాదులు హిందీసాహిత్యంలోని భావములకు విపులీకరణములే యని వీరి వాదము. వాస్తవమే కావచ్చు' అని గొల్లపూడి ప్రకాశరావుగారు ఒక పాలు అంగీకరించినట్లుగ మొగ్గుచూపిరి. పుష్పవిలాపమునకు మాత్రము హిందీమూలమున్నట్లు కనిపించదు.

కొందరు మహాపండితు లీ 'పుష్పవిలాపము' నాస్తికతాప్రబోధముగనున్నదని అభిప్రాయ పడుచున్నారు. అటువంటి అవకాశ మేమాత్రమూ ఇందు కనుపింపదు.

'చేతులారంగ నిన్ను పూజించుకొరకు
కోడి కూయంగనే మేలుకొంటి నేను;
గంగలోమున్గి, ధౌతవల్కలము గట్టి
పూలు గొని తేర నరిగితి పుష్పవనికి'

అను పద్యముతోడనే కదా ఈఖండకావ్య మారంభమైనది. గంగలో మునిగి, ధౌతవల్కలము గట్టి భగవదర్చనకై పూలు కొని తేవడానికి వెళ్ళానని కవి భగవంతునితో స్వయముగ పల్కుచున్నారు. కనుక కరుణశ్రీ నాస్తికుడని కాని, ఈ ఖండకావ్యము నాస్తికతాప్రబోధక మని కాని పుష్పవిలాపమును బట్టి మాత్ర మేమాత్రమూ అభిప్రాయ పడవలసిన అవసరము లేదు నైతిక విలువలను పెంచుచు ఉదాత్తమైన భావమును వ్యక్తము చేయుచున్న పుష్పవిలాప మొక అపురూపపు కళాఖండముగ భావించుట సహృదయుల కనీస కర్తవ్యమని నా భావన.

1. Dictionary of world literary terms. Page 237.
2. అభిజ్ఞాన శాకుంతలము - ప్రథమాంకము.
3. సాహితీమంజూష. పుట 320.
4. 22-5-1970 ప్రజారథం మాస పత్రిక. పుట 17.
5. 16-12-77 వ తేదీ సమాలోచన.
6. 16-2-78 వ తేదీ సమాలోచన.
7. కరుణశ్రీ కవితాశ్రీ. పుట 86.

— ... —

# ఈ పక్షంలో

## నాటక ప్రదర్శనము

ది 26-8-81 తేదీ బుధవారం రాత్రి 7-30 గం॥లకు రాజమండ్రి వేంకటేశ్వర ఆనం కళాకేంద్రంలో కళావాణి యూనిట్ వారి యాజమాన్యమున కీ. శే. అవసరాల సూర్యారావు గారు రచించిన 'పంజరం' అనే సాంఘిక విషాదాంత నాటకం ప్రదర్శింపబడింది.

నాటక ప్రారంభానికి ముందు జరిగిన సభకి శ్రీ ప్రతివాద సూర్యనారాయణ గారు అధ్యక్షత వహించి ఆంధ్రనాటక రంగపరిస్థితిని సమీక్షించిరి. ఔత్సాహిక నాటకసంఘములను ప్రోత్సహించవలసిన ఆవశ్యకతను వివరించి, ప్రేక్షక సంఘము ఏర్పడవలసిన అవసరమును వాటికర్తవ్యమును తెలిపి, నాటకకళాభివృద్ధి కనేక సూచనలు చేసిరి. శ్రీ కత్తుల కృష్ణభాగవతార్ అన్ని హంగులు కల నేటికాలంలో నాటకకళ ఉన్నతస్థాయి నందుకోగల దని ఆకాంక్షించిరి సిండికేట్ బ్యాంకి మేనేజరు శ్రీ చల్లా రామమోహనరావుగారును కేవలం ప్రభుత్వ సహాయంమీద ఆధారపడక ప్రజల ఆదరాభిమాన ప్రోత్సాహములపై నాటకకళ వర్ధిల్లవలె నని చెప్పి నాటకాభివృద్ధికి సూచనలు చేసిరి. పది పన్నెండుగురు వక్తల ఉపన్యాసములు లేకుండ సభ ముచ్చటగా ముగ్గురి హితమిత ప్రసంగములతో రమణీయముగా ముగిసినది.

'నిరుడు కురిసిన హిమ సమూహములు' కార్యక్రమపరంపరకు నాంది గా 'పంజరం' నాటకం ప్రదర్శింపబడుతున్న దని ఇంకను కొన్ని ప్రదర్శనములు వరుసగా (2 నెలలకొకటి) ప్రదర్శింపబడునని తెలుపబడినది. స్వల్పములైన లోటుపాటులున్నా ప్రథమ నాటక ప్రదర్శనము విజయవంతమైన దని చెప్పవచ్చును.

అనుమానపిశాచమువలని అనర్థములు, లంచగొండితనపు రీతులు, దురాశాపరులై లంచములు పట్టువారికి తుదకు కలిగే దుస్థితి ఇందు వివరింపబడి నాటక ప్రయోజనమైన చక్కని సందేశము కాంతా సమ్మితముగా వ్యక్తపరుపబడినది.

పాత్రల సంభాషణల ఉచ్చారణ కొన్నిచోట్ల ఇంకను స్పష్టతను కోరుచున్నది. శబ్దవిస్తరణ యంత్రబలము (మైక్) చాల లేదనిపించినది. మరియొకటి కూడ ఏర్పఱచిన నింకను బాగుండెడిది. తరువాతి ప్రదర్శనము లింకను రమణీయములు కాగలవని ఆసింపవచ్చును.

—...—




## శ్రీమత్ భాగవత మణిహారము - ప్రథమ సంపుటి

[సంకలనకర్తలు, సంపాదకులు, ప్రకాశకులు శ్రీ దర్భా వేంకట రమణ నటరాజ ప్రభాకర్, ప్రోత్సాహకులు శ్రీ దర్భా సూర్యనారాయణ, శ్రీమతి దర్భా సుబ్బలక్ష్మి, 470+78 పుటలు మూల్యము : శ్రద్ధా భక్తులు. దొరకుచోటు : శ్రీనివాస నిలయము, 14, 139 గాంధీపురం-2, రాజమండ్రి-3. ]

వేల సంఖ్యలో శ్రీమద్భాగవతమందలి అనర్ఘ శ్లోకరత్నముల నేటి, పోతన పద్య గద్య రత్నములతో కూర్చి నిర్మితమైన యీ మణిహారమును గుఱించి అనేక విద్వత్తపస్వి పుంగవులు సుమారు డెబ్బది పుటల అభిప్రాయముల నొసగి ప్రశంసించి యున్నారు. అతిప్రసిద్ధమైన భాగవత ప్రశంస అధికముగా పునరుక్తమైనది.

ఇక శ్రీ దర్భా సూర్యనారాయణ గారు ఈ గ్రంథమున సంకలనము చేసిన భాగములు ప్రథమాది సప్తమస్కంధ పర్యంతము మాత్రమే. మిగిలిన స్కంధముల రత్నములు ద్వితీయ సంపుటమున కూర్చబడునని భావింప వచ్చును. ఈ ప్రథమ సంపుటముననే సుమారు 3600 వ్యాస పోతనల పద్యరత్నము లున్నవి. ఇవన్నియు రత్నములే అయినను అన్నియు నాయకమణులు అనజాలము.

ఇది ముఖ్యముగా విద్యార్థులకు భాగవత ధర్మములు బోధించుటకై యుద్దేశింపబడినట్లు ఇందలి 'నా బాలవాక్యము' ను బట్టి స్పష్టపడుచున్నది. ఇన్ని పద్యములు శ్లోకములు పఠించుట అర్థము చేసికొనుట నేటి విద్యార్థిలోకమునకు సులభము కాదనిపించును. ఈరత్నములనుండి నాయకమణు లనదగిన కొన్నిటిని వేఱుగా సంక్షిప్త ప్రతిగా అర్థతాత్పర్యములతో ప్రచురించిన నెక్కువ ఉపయోగము కాగలదు, లేదా అట్టి వానిని మలిముద్రణములో * పువ్వు గుర్తుతో సూచించినను కొంతమంచిదే. విద్వాంసులకు పరిశోధకులకు ఈ బృహద్గ్రంథ ముపకరింపగలదు

సంస్కృత పద్యరత్నముల నేటి తచ్ఛాయా సదృశము లనదగిన పోతన పద్యములను క్రోడీకరించుట అసాధారణమైన విషయము. ఈకృషి యోగాభ్యాసమువంటి దనవచ్చును. ఉన్నత లౌకికోద్యోగము నిర్వహించియు, ప్రస్తుతము పవిత్ర ఆధ్యాత్మిక జీవనము నడపుచున్న శ్రీ దర్భా సూర్యనారాయణగారి నిందు కెంతయు నభినందింపదగును. వీరి సతీమణి, పుత్త్రరత్నము వీరికృషికి దోహదము చేయుట మహాదృష్టము భక్తిశ్రద్ధలే మూల్యముగా ఏతత్ప్రచారము గావించుచున్నవారి త్యాగశీలత నిరుపమానము.

- గౌతమ.

—...—

# సమాలోచన సంపుటములు

వివిధ సాహిత్యాది విషయాలకు చెందిన 241 రచనలతో కూడిన సమాలోచన తృతీయ సంపుటము 24 సంచికలు ఒకే వాల్యూముగా హాఫ్ క్యాలికో బైండు చేయబడి అమ్మకమునకు సిద్ధముగా నున్నది.

వెల రు. 20 లు. ఎం. ఒ. ద్వారా పంపినవారికి పోష్టుఖర్చులు మేమే భరించి రిజిష్టర్డు పోష్టులో పంపగలము. వి. పి. పద్ధతి లేదు.

మొదటి, రెండవ సంపుటముల వాల్యూములు పూర్తిగా అయిపోయినవి.

— సంపాదకుడు.

అడ్రసు :—

సంపాదకుడు, బులుసు సీతారామశాస్త్రి,

రిటైర్డు తెలుగు లెక్చరరు, వి. టి. జె. కాలేజి,

6-8-7, ఇన్నీసుపేట (త్యాగరాజనగర్), రాజమండ్రి-1.

Editor, Printer and Publisher B. Sitharama Sastry, Printed at B. V. & Co., Press, Innispet, (Tyagaraja Nagar) Rajahmundry-1.